శ్రీ

# అవధానసారము

గ్రంథకర్తలు.
అవధాని పంచానన & కవిసింహ
డి. రాజశేఖర వెంకటశేష కవులు.
శతావధానులు.

ప్రకాశకులు.
జనోపకారిణీప్రెస్సు, ప్రొద్దుటూరు.

1932

 వెల రు.0-8-0

# కాపీ రైటు.

—:o:—

# ఉపోద్ఘాతము.

శ్లో॥ క్షాంతిశ్చేత్కవచేన కిం కిమరిభిః క్రోధోఽస్తి చేద్దేహినాం
జ్ఞాతిశ్చేదనలేన కిం యదిసుహృద్దివ్యౌషధైః కిం ఫలం
కిం సర్పైర్యది దుర్జనాః కిముధనైర్విద్యానవద్యా యది
వ్రీడా చేత్కిముభూషణైః స్సుకవితా యద్యస్తిరాజ్యేన కిం
"భర్తృహరి."

శ్లో॥ కాఽపృచ్ఛామ స్సురాన్స్వర్గే నివసామో వయం భువి
కిం వా కావ్యరస స్స్వాదుః కిం వా స్వాదీయసీ సుధా
సుభాషితరత్నభాండాగారము.

అభిరూపశేఖరులారా!

అవధానసారమను నీహొత్తమున కుపోద్ఘాతము వ్రాయు నవకాశము గల్గించిన గ్రంథకర్తలు ప్రశంసార్హులు. ఉపోద్ఘాతములు వ్రాయు నేర్పు మిగులఁగలవారు పెక్కండ్రుగలరు. తమ పాండిత్యమంతయుఁజూపి యొంతో యెంతగులుక వ్రాయు పెద్దలెందఱో కలరు. కవిత్వప్రశంసగల పూజ్యుల నుడులు తొలుతనే పేర్కొనఁబడినవి. వానిం దిలకించినపుడు ప్రాచీనుల భావమీవిషయమున నెట్లుండునదియు బోధపడును. "విద్యలలోపల నుత్తమవిద్య కవిత్వంబు" అని మహనీయులు నుడివిరి. "అధ్యాత్మవిద్యా విద్యానామ్" అని గీతాశాస్త్రమునఁ జూపఁబడెను. ఈరెంటికిఁ బరస్పరవైషమ్యము గలదని యూహింపఁబనిలేదు విషయభేదమునుబట్టి యన్వయించుకొనిన సరిపడును.

శ్లో॥ 'కింతుస్త్వాతలసర్వశేషవిదుషాం సాహిత్యవిద్యాజుషాం
చేత స్తోషకరీ శిరో నతికరీ విద్యానవద్యాస్తినః.

అని భవభూతిమహాకవి వచించెనుగదా.

శ్లో॥ అంగానివేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః
పురాణం ధర్మశాస్త్రంచ విద్యాహ్యేతాశ్చతుర్దశ.

వీనింబట్టి విద్యాశబ్దమున కర్థము నిర్ణయింపవచ్చును. ఈచర్చను చాలింతును. విద్యలన్నిఁటిలో నుత్తమవిద్య కవిత్వ మని కొందఱతాత్పర్యము. "వ్రతానాముత్తమంవ్రత" మ్మను నట్లు ప్రధానత్వ మారోపింపఁబడుచుండునని కొందఱందురు. కాని యది యంతగా విశ్వసింపఁదగిన మాటకాదు. శ్రమించి పఠించిన శాస్త్రమువచ్చును. కవిత్వ మట్టులలవడదు. పూర్వపుణ్యపరిణతి కల్గిననే యది లభించును. పురుషప్రయత్నము చేతనే యది సాధ్యముగాదు. కావుననే పండితులెల్లఁ గవుల కానోపరు. "భోజనం దేహి రాజేంద్ర!" యని వ్రాసి మీఁదుతోఁపక బ్రహ్మలోకపర్యంత మాలోచించుచుఁ గూర్చుండిన పండితాఖండలు లెందఱోగలరు.

ఇఁకఁ బ్రకృతము ననుసరించెదను. ఆంధ్రమున బహువిధకవిత్వములు గలవు. ఆశుధారా కవిత్వమందొకఁడు; కాని యది పెద్దలయాదృతి నంతగాఁబడయు లేదు. జలపాతము వలె సభాసదుల కర్ణతాడనము నిరంతరాయముగఁ గావించు నాశుధారాఘోష మెవ్వారు నిరసింపకుందురు? ఆశుకవిత ఘోషించు కవివదన ముదయమున నీలవినఁబడినంతనే చక్ర

ములన్నిఁటిని గదలించుకొని త్రోతపెట్టుచుఁ బని చేయునొక మహాయంత్రాలయము వంటివి. అవధాన కవిత్వ మట్టిది గాదు. సమస్యా పూరణములును సద్యో వర్ణనములును భోజునికిఁ బూర్వమునుండియు రాజాధిరాజుల మెప్పునకుఁ బాత్రములై యుండెడివి. ఆకాలమున విద్వత్సభారంగములన్నియుఁ బైవాని ప్రదర్శనములతో శోభవహించుచుండెడివి. రాజాస్థానముల మహాకవులు తమ ప్రతిభనంతయుఁజూపి సద్యఃకవిత్వమున శ్లోకములు రచించుచుండిరి. ఒకరినొకరు మించఁజూచుచుండిరి. రాజులుగూడఁ గవితయందాఱితేఱియుండిరి. కవుల కక్షరలక్ష లిచ్చుచుండిరి. ఆదరించుచుండిరి. తమకన్న నెక్కుడుగఁ జూచుకొని యర్చించుచుండిరి. వారి నెడఁబాసియుండలేక పరితపించుచుండిరి.

ఆశుధారాకవిత్వమునకు నవధానకవిత్వమునకు నెంతయో భేదముగలదు. విషయమిదియని చెప్పియుఁ జెప్పకమునుపే రాళ్లచేన గుంటకవలె నాశుకవి పడుచును. గంటమ్రోగినంతనే గమ్యస్థానముదెస కనంతవేగమునఁ బాఱు పందెపు గుఱ్ఱమువలె నతఁడు పరువెత్తును. అంతకన్న మందగమన మతనికిఁ బనికిరాదు. కొండమీఁదిగుండు. కదలినయుత్తరక్షణమునసే రాయిరాయికిఁ గొట్టుకొనుచు దొరలును ఎప్పుడు నిలుచును? తగ్గునఁజేరినప్పుడే. అంతవఱకు నిలువదు. అవధాన కవిత్వమట్టిదిగాదు. పృచ్ఛకుఁడు రసవంతమగు ప్రశ్నమునిచ్చును. అవధాని తగినవ్యవధిగొని యోజించి పుష్టిగలభావములన

రించుకొని మృదుమధురశబ్దములతో నొకచరణము చెప్పవచ్చును. ఇతఁడు పైవానివలె సముద్రమంతయు నొక్కమా ఱీఁదవలసినదిలేదు. దేశకాలపాత్రముల నెఱింగి తనబుద్ధిఖని నుండి పృచ్ఛకులు కోరినరత్నములను వెలికిఁదీసి చూపించు నవకాశమితనికిఁ గలదు. అవధానకవిత్వమునకును గేవలాశు ధారాకవిత్వమునకును జక్కెరకు నిసుకకును గలభేదముగలదు.

అవధానకవిత్వము చమత్కృతి జనకము. కవులందఱు నవధానము చేయఁజాలరు. వేవురలో నొక్కఁడే చేయఁజాలునసవచ్చును. సభాముఖమున నవధానరచన మెప్పువడయఁజాలును. అవధానమొనరించు సత్కవులఁగాంచి కవులుగూడ నచ్చెరువందుదురు. మాటలాడినట్లే పద్యములు హృద్యములై వెలువడుచుండ నానందింపనివాఁడు మూర్ఖుఁడుగాక మఱెవ్వఁడగును? అవధానములవలని ప్రయోజనము లనేకములు. మాటమాత్రమునఁ జప్పరించి త్రోసివేయరాదు.

పందొమ్మిదవశతాబ్ది చివర నాంధ్రత్రిలింగదేశముల యందవధానములొనరించి వాని పరిశ్రమమిట్టిదని తేటపఱచినవారు బ్ర. శ్రీ॥ తిరుపతి వెంకటేశ్వర కవిత్లల్లజులు. వారి నానారాజసందర్శనమే యీవిషయమును జేటతెల్లము చేయుచున్నది.

మనగ్రంథకర్తలను గుఱించి కొలఁదిమాటలు వ్రాసెదను. వయస్సునఁ జిన్నవారు. ఈయిరువురు నొక్కచో విద్య నభ్యసించినవారునుగారు. ములికినాటి విప్రులతెగకుఁ జేరిన

వారు. రాజశేఖరు వెంకటశేషశాస్త్రి నామధేయులు. వీరిరువు రుగలసి పెక్కుపురముల విద్వజ్జను "తారా" యను నవధానములు మిగుల జయప్రదముగ నొనరించిరి. వీరిలో రాజశేఖరకవిగా రాంగ్లేయభాషలోఁ బోలిపరీక్షయందాఱితేఱి యింటరుమీడియేటుగూడఁ గొంతకాలముచదివి న్యాయస్థానమున నుద్యోగమునసుండి దానినివదలి యిప్పుడు స్వచ్ఛందవృత్తి నున్నారు. ప్రొద్దుటూరు తాలూకుబోర్డుసభ్యులై చాలకాలమునుండి పనిచేయుచున్నారు. ఇంకను బెక్కుగౌరవోద్యోగములందిరి. ధనధాన్యక్షేత్రసంపన్నులు. ప్రొద్దటూరికి వచ్చు పెక్కుమంది గాయకులను గవులను సత్కరించి యాదరించు మృదుస్వభావులు. వీరి సోదరకవులు వెంకటశేషశాస్త్రి గారు వయస్సున నింకను జిన్నవారు. సంస్కృతాంధ్రముల మంచి పాండిత్యము గలవారు. నిశితప్రతిభావంతులు. వారికిఁ బరస్పర బాంధవ్యముగూడ లేకున్నను దేహభేదమే కాని మానసిక భేదమేమాత్రము లేని మైత్రీసంపన్నులు. వెంకట శబ్దము విశేషణముగా నన్వయించినచో రాజశేఖర వెంకటశేష శబ్దములకుఁగల పరస్పర సంబంధము తేటపడును. కనుకనే కాబోలుఁ గలసి యేకరీతిగా నవధానము చేయు శక్తి యులవడినదన వచ్చును. ఒక్క విశేషము. సంపన్నగృహస్థులగు వీరు సాధారణముగ నందఱవధానులవలెఁ గాక ప్రత్యేకముగాఁ బ్రాజ్ఞుల యాహ్వానములు వచ్చినపుడు మాత్రమే యాయాస్థలములకు వెళ్లి యవధానము లొనరించుచుండిరి. అవ

ధానసభ నేర్పఱుపుఁడని ముందు నాలుగుదినములును సవ ధానమైన పిదప ద్రవ్య సంగ్రహణమునకు మఱినాలుగుదిన ములు నింటింటికిఁ దిరుగు భారము వీరెఱుంగరు. కడప పుర రమున బ్రహ్మశ్రీ సోమంచి నీలకంఠము పంతులు బి. ఏ. బి. ఎల్. (Subordinate Judge) గారాహ్వానింపఁగా వారి యింటవిడి సి వీరు మాపురమున నొక శతావధానము నొనరించిరి. ఆ సభకు విద్వద్వరేణ్యులగు జి. గంగాధరసోమయాజి యం. ఏ. బి.యల్. (District and Sessions Judge) గారధ్యక్షులైరి. అతి స్వల్ప కాలమున నవధానము పూర్తిచేయఁ బడెను. వీరి కవితాధాటి నిరంకుశము. అనర్గళము. శైలి నిరుపమానము. విషయమెంత క్లిష్టముగ నున్నను నిరాయాసముగ వెంటనే గ్రాంథికశైలిచేఁ బద్యములల్లిరి. ధారణాశక్తియు మిక్కిలి చక్కనిది. అవ్వల సన్మానసభ జరిగెను. వీరఘంటా శోభిత మైన సువర్ణసూత్రముల నర్పించి సభాసదులు వీరిని గౌరవిం చిరి. వీరి పాండిత్య కవిత్వ పటుత్వముల కలరి "కవిసింహ" బిరుదము నర్పించుకొనిరి. ఇట్లే మహోత్సాహ విజయముల తోఁ బెక్కుతావుల నవధానము లొనరించి పేరుఁగాంచిరి. ఆయవధానములందుఁ జెప్పఁబడిన పద్యరత్నములే యీపొత్త మునందుఁ గూర్పఁబడినవి. వీనిని దిలకించిన వీరి కవితాశక్తి యెల్లరకుఁ దెలియఁగలదు. ప్రశ్న ప్రతివచనముల పద్ధతి తేట పడును. కవితా వైదుష్యము గ్రాంథిక శైలిని మీఱి యున్న ట్లు బోధపడును. అంతియగాక కల్పనాచాతుర్య మనమాన

మని చెల్లుడియగును. మఱియు మృదుతమ పద సంవిధానము బహుళముల్పడును. వీనికిందోడు రసపుష్టి గోచరించును. ఈచిన్ని పొత్తమే వీరి శక్తి విశేషమును జాటుచున్నది.

అవధానమునఁ జెప్పిన పద్యము లోకరీతిగను గ్రంథమునఁ జేర్చు పద్యము లోకరీతిగను గొందఱకుండును. వీరి పద్యము లిట్టివిగావు. చక్కఁగా నాలోచించి రచించినట్లే యుండును. అవధానేతరకాలముల యందీరెండు తెగల పద్యములు చదివిన నేవి గ్రంథమున నుండునవియో యేవి యవధానమునఁ జెప్పినవియో యెఱుంగుట సాధ్యము కానిపని యో. ఈశక్తి యలవడుట పూర్వజన్మపుణ్యమే యనవలయు. ఒక్క యవధానమునకైన నొక్కవిషయమునకైనను వీరు స్వకృత్యమున నేమఱుపాటొందినది లేదని నేనెఱింగినంతవఱకు గట్టిగాఁ జెప్పఁగలను.

దత్తమండలము లనఁబడు కడప, కందనూలు, బళ్లారి, యనంతపురములను నీభాగములయం దవధానము చేయువారు లేరనవచ్చును. ఈమండలములు విద్యావిహీనములని యందురు. అట్టి లోపము నీయిరువురు కవిసింహములు తీర్చిరనుట కేసందేహములు లేవు. ఇపుడు వేళ్లుమడిచి యెన్నఁబూనిన నీమండలల చతుష్కమందును గనిష్ఠాంగుళిం జేరు పేరులు వీరివిగాక మఱెవ్వరివి కానరావు. దత్తమండలములకుఁగల యపఖ్యాతిని దొలఁగించిరని చెప్పుట వీరిని భూషించుటగాదు. మండలముల భూషించుటయు యనవలయును. కావున నీయు

[illegible] సమంచలము లప్పుడినవియే. ఇంవలివారు పీఠికం

[illegible]గా చెండవలయును.

ఇటిలో రాజశేఖరకవి యవధాన రచనమేగాక బహు గ్రంథములు రచించెను. రామాయణ నాటకములును, వీరమతి చరిత్రము, చండనృపాలుని చరిత్రము, మఱికొన్ని గ్రంథములు వ్రాసెను. ప్రస్తుతము "రాణాప్రతాప సింహుని" దివ్య చరిత్రమును వ్రాయుచున్నాఁడు. భగవంతుఁ డీ కవిసింహాల కాయారోగ్యములఁ బ్రసాదించి యింకననేక గ్రంథములు రచించుటకుఁ దగు నుత్సాహము గల్గించుఁగాత మని కమంగముఁ బ్రార్థించుచున్నాఁడను.

కు ప ప.
౭—౯—31

ఇట్లు,
విద్వద్విధేయుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.



# విజ్ఞప్తి.

మాలో నొక్కరగు డి. రాజశేఖరము ప్రొద్దుటూరు న్యాయస్థానము (District Munsiff's Court) న నుద్యోగిగాఁ బనిచేయు కాలమున వెంకటశేషశాస్త్రి, బ్ర॥ రూపావతారము శేషశాస్త్రిగారి యొద్ద గీర్వాణ భాషా సాహిత్య గ్రంథములను బఠించి తర్క వ్యాకరణము లభ్యసించు చుండెను. 1912 సంవత్సరమున రాజశేఖరకవి "యాంధ్రభాషాభివర్ధినీ" గ్రంథాలయము నెలకొలిపి పనిచేయు సమయమున వెంకటశేషశాస్త్రి పరిచితుఁడయ్యెను. అప్పటినుండియు, నిరువురమును గలిసి కవనముఁ జెప్ప నారంభించితిమి. రాక్షసవత్సరాశ్వయుజ మాసారంభమున జరిగిన కవితా పరీక్షలోఁ బరీక్షాధికారులు ప్రథమస్థానము నొసంగి మమ్ము బహూకరించిరి. తద్విషయికమయిన శరన్నవరాత్రవిద్యావళి ప్రత్యేకపుస్తకరూపమున ముద్రింపఁబడి యున్నది. వెంకటశేషశాస్త్రి యప్పుడప్పుడు విలాసముగఁ గొన్ని యవధానము లొనరించెను. వానిలో రెండిఁటి సారాంశ మీగ్రంథారంభమునఁ గానఁబడును.

ప్రొద్దుటూరికి (19.9-1921) శ్రీమాన్. నీలమేఘ శ్రీనివాస నృసింహాచార్యులు బి. ఏ. బి. యల్. గారు మునసఫుగా విచ్చేసిరి. వీరాంగ్లేయ భాషలో నసమాన పాండిత్యము గలిగి యుత్తమశైలిని వ్రాయఁగలిగి యనర్గళధారాకముగ నుపన్యసింపఁగల ప్రౌఢులు, ఆగర్భ శ్రీమంతులు, మృదులాతి

మృదుల హృదయులు. దాక్షిణ్య సముద్రులు. వీరు 17-12-1920 దినమొక గొప్ప సభ నేర్పాటుచేయించి యష్టావధాన మొనరింపుఁడని మాయిరువురను ప్రోత్సహించిరి. అవధాన నిర్విఘ్నపరిసమాప్తినిగుఱించియు నుదారవిజయమును గుఱించియుఁ గవిపుంగవులు నున్నతోద్యోగులును వ్రాసిన గద్య పద్య భాగములు వెల్లడించును.

మహాశయుల యాహ్వానముల ననుసరించి మేము కడప, కర్నూలు, నెల్లూరు, ననంతపురము లోనగు మండలముల ననేకప్రదేశములఁ బెక్కు లవధానము లొనరించితిమి. అప్పటికిఁ గొన్ని గ్రంథములు వ్రాసి యనుభవ మలవడి యుండుటవలన సరసరచన యారూఢముగనుండి యవధానములలోఁ గవ మేమాత్రమును గనఁబడకుండెడిది సభల కరుదెంచిన పండితులు పెక్కు రీవిషయమై ప్రస్తావించి శ్లాఘించుటయుఁ గవులనేకులు గౌరవ పద్యములు వ్రాసి మమ్మాశీర్వదించుటయు వాడుకగా జరుగుచుండెడిది.

మాలో రాజశేఖరకవి నాలుగు సంవత్సరములుగఁ బ్రొద్దుటూరు తాలూకుబోర్డునం దుపాధ్యక్షుఁడు (Vice-President) గను, మునిసిపాలిటిలో నాతేడేంష్టుగ సభ్యుఁడు (Councillor) గను, గొంతవఱకు విశ్వవిద్యాలయసభ్యుఁడు (Member, Madras Senate) గను గొన్ని వత్సరములుగ నెక్సైజు అడ్వైజరీ సంఘసభ్యుఁడుగను బనిచేయవలసి వచ్చుటచే మేమిప్పుడవధాన ప్రదర్శనముల నాసక్తితో సాగిం

చుచుండుట లేదు.

అవధానరచన జయప్రదముగ సాగవలెనని ధారా ధారణా ధైర్యములు ముఖ్యావసరములు. ఈ త్రయమున నేది తక్కువైన నభావమైన నవధానము జయప్రదముగ సాగదు. కవి మనస్సున విషయము గోచరించి భావస్ఫురణము గలిగి రసవత్పదజాల మనర్గళధారాప్రవాహమున ఛందోబద్ధమై వెలువడుటయే ధార. అది యలవడక యవధానికవి బ్రహ్మ లోకపర్యంత మాలోచించుచుఁ గూర్చుండిన సభ్యులు శాశ్వతబ్రహ్మకల్పము వేచియుండఁజాలక లేచి యిండ్లకరుగుట తటస్థించును. సభలోఁ గూర్చుండి గణములలోని గురులఘువుల లెక్కించుకొనుచు నక్షరాక్షరముగ మందమందముగఁ గవిత సాగించి యవధానము సేయఁ బూనుట కేవలము హాస్యాస్పదము.

అవధాన కార్యమునఁ బృచ్ఛకులడిగిన ప్రశ్నములను వాని క్రమమును దాను రచించిన పద్యములను వృత్తవైవిధ్యములతోఁ వ్రాసిన భేదములతో బుద్ధియందు ధరింపఁగలుగుట ధారణ. దృఢమగు ధారణ లేకున్న నవధానమందలి వివిధ విషయములు భ్రంశములై వ్యస్తవ్యస్తములై యపజయము నాపాదించును. మంచి జ్ఞాపకశక్తి యున్న విషయము లుపస్థితములై రచన చక్కఁగా సాగి యవధానము మనోహరగ ప్రసూదావన సంచారమునట్లు సుఖముఁ జెంపొందించును.

మూఁడవది ధైర్యము. ఇది లేనివాఁ డవధానమున కే

కా దేకార్యమునకైనఁ బనికిరాఁడు. సమస్తబలములందును ధైర్యము మానవునకు మాతృస్తన్యమువంటిది. ధైర్యహీనుని సభారంగ ప్రాంగణమునకుఁ దీసికొని పోయిన దేహమాపాదమస్తము వడఁకెత్తి బట్టపేలికలవలెఁ గాళ్లు తూగాడి చూపు మందగించును. పృచ్ఛకులు సారస్వత విషయములను బ్రశ్నించుటకు మాఱుగా నారోగ్య ప్రశ్నములతోఁ గవిని దేర్పవలసిన వారగుదురు. తన దుస్థితి నెఱిఁగించుటకైన శబ్దజాలము లభింపక మ్రాన్పడిన యాతనికి సభ, భస్మై, కంపము పంకమై, యందుండి లేచిపోవుటకుఁగూడ నితరులసాయ మవసరమగుట తప్పదు. రణరంగమున భేరీభాంకరణముల మధ్య నిలిపిన నిట్లట్లు నంతయైనఁ దుంపెసలాడని యేకాగ్రమనోధైర్యములుగలిగి యనర్గళప్రవాహమునఁ గైత సాగింపఁగల యవధానికవికి విద్వదాస్థానము మల్లెపూఁదోఁటవలెఁ గ్రీడాస్థానమై తనరారకపోదు. స్వచ్ఛందధారయు సుస్థిరధారణాబలమునులేని వాని ప్రయత్నము మంచిసామగ్రి లభింపక బెండ్లతోఁ బాలకి గట్టినట్లుండును.

పై గుణములకుఁదోడు ప్రసన్న మనోహరమూర్తియు మంగళగళరావ సంపదయు నలరారిన మఱింతసుఖదాయకమే. సమానపాండిత్య కవిత్వకౌశలములుగల యిరువురలో శ్రావ్యమైన కంఠనాదముగలవాఁ డత్యంత శీఘ్రకాలమున సభాస్తారుల మనంబుల నాకర్షింపఁ గలుగునని యనుభవముఁ బట్టి మేము చెప్పఁగలము. వివిధరసముల కాలవాలమై యా

నందముఫలమై నడపెడువారిరువురై యొప్పు నవధానసభలు నాటకప్రదర్శనముల కన్నివిధముల మిన్నలై సభ్యులఁ దన్మయత్వమునొందింపఁగలవు.

భోజ కాళీదాసుల నాటనుండియు సమస్యాపూరణాదులు జనాదృతిఁ గాంచుచున్నవి. ఇవి సారస్వతమున కుండవలసిన యలంకారములే. కవులింటఁ గూర్చుండి వ్రాసి ముద్రించిన గ్రంథములుచదివి యానందించుటకును, వారుసభాగ్రస్థానమున నాసీనులై యడిగిన ప్రశ్నముల నదుర్కొని ధారాళధారా పరంపరాకముగాఁ గవిత్వము సాగించుటనుజూచి యానందించుటకు నెంతయో భేదముగలదు. గాయకుని ప్రసన్నవదనారవిందమును జూచుచు నానందసంధాయకమగు నతని గానము నాలకించుటయెట్లుండును? ఆగానమునే నిర్జీవమగు 'ఫోనోగ్రాఫున' వినుటయెట్లుండును? మిత్రు లొకరియెదుర నొకరు కూర్చుండి హృదయములువిప్పి యనురాగాలాపములాడుటయెట్లుండును? పరస్పరచ్ఛాయా పటసందర్శనము లెట్లుండును? ఒక విధముగఁ గార్యసాఫల్యము రెండుగతుల నున్నదేకాని యేది యెక్కుడుగ నానందముఁ గూర్చునో విజ్ఞులెఱుంగుదురు.

ఏ దేని గుణలేశమున్న లోకము గ్రహించునుగాతమని మే మందందు జరిపిన యవధానముల యందలి పద్యముల నెల్ల గ్రంథరూపమున ముద్రింపించి యున్నాము. మమ్మాహ్వానించి యవధానము లొనరింపఁ జేసిన మహాశయులకును నాద

రమేదుర హృదయములతోఁ బద్యములు వ్రాసి మాకీర్తి నతిశయింపఁ జేసిన కవ్యగ్రణులకును వందనము లర్పించుచున్నాము. ఈ గ్రంథ ముద్రణాదికముల కగుద్రవ్యమునిచ్చి కృతకృత్యులయిన చి॥ పి. ఎఱ్ఱమునిరెడ్డి, ఆర్. నృసింహారెడ్డి సి. ఎఱుకలరెడ్డిగారి నభినందించు చున్నాము

ఉపోద్ఘాతమ్ము వ్రాసి వన్నెఁ జేకూర్చిన యాంధ్రవ్యాసులు శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారికిఁ గృతజ్ఞతఁ దెలుపుకొను చున్నాము.

'జననాథాగ్రణియాత్మరాజ్యమునవిచ్చల్ పూజ్యుఁడా సీమఁబాసినఁ డాగవ్వయుఁ జేయఁడన్నికడలన్ శ్రేష్ఠుండు విద్వాంసుఁడా యనకన్నన్ గవి మేటియా "సుకవితా యద్యస్తి రాజ్యేనకి" మ్మనువాక్యంబునిజంబు దీనిఁగని కావ్యంబుల్ రచింపన్ దగున్ "

"అప్పయ్యకవి"

| | |
|---|---|
| ప్రొద్దుటూరు.<br>1—6—1931 | ఇట్లు,<br>కవిసింహ & అవధాని పంచానన<br>రాజశేఖర వెంకటశేష కవులు.<br>శతావధానులు. |






కవిసింహ & అవధానిపంచానన

బ్ర॥ రాజశేఖర వెంకటశేషకవులు.

శతావధానులు.



శ్రీ

కామేశ్వర్యై నమః

# అవధాన సారము

కమలాపురము తాలూకు దాదిరెడ్డిపల్లెలో

జి. వేంకటశేషశాస్త్రిగారొనరించిన యష్టావధాన విధానము.

మ॥ కరుణాలోకనుఁడీశ్వరేశ్వరుఁడు లోకత్రాణబద్ధవ్రతుం
డరుణప్రాంతజటాకలాపి గిరికన్యాజాని భక్తాళిహృ
త్సరసీజంబులకున్ నవీనదిననాథజ్యోతియై పొల్చువాఁ
డనుదారన్ మదభీష్టముల్ నెఱపియాహ్లాదంబు సంధించుతన్

మ॥ తనప్రేమంపుఁదనూజుకన్నఁగడువాత్సల్యమ్ము పెంపార వే
డ్కన్ నన్ బెంచుచు రామశబ్దము మొదల్గా నీసభన్ నిల్పు నే
ర్పును సామర్థ్యము నాకొసంగిన ఘనున్ రూపావతారాన్వవా
యనిశానాథుని శేషశాస్త్రి ముదుపాధ్యాయున్ మదిన్ గొ
ల్చెదన్॥

మ॥ సరసంపున్ గవితల్ రచించు నెడ విశ్వాసమ్ము మై నన్ను సో
దరుగా నేఁచుచు గౌరవంబు దయ వాత్సల్యంబు పెంపారఁ బ్రే

మరసార్ద్రోక్తుల ముచ్చటించుసరసుఁ డాయన్నసీరాజశే
ఖరు వాచావిభవాభిరాముఁ గవిలోకశ్రేష్ఠుఁ గీర్తించెదన్.

## —♦ అ వ ధా న ము ♦—

(1) ఉదయదాదిత్యప్రార్థనము-శార్దూలము. (సంస్కృతము)

శ్లో॥ లోకాలోకపరీతమేతదఖిలం ధ్వస్తాంతమోనాశయన్
సంఫుల్లన్నవపద్మపత్రకుశలం తన్వన్ ప్రభూతోదయః
సూర్యోపాస్తివిధాననిత్యకుశలాన్ విప్రాన్ సమాశ్వాసయన్
జాతస్సోయమహఃపతిర్దిశతు నశ్శ్రేయాంసిభూయాంసిచ.

(2) వనవర్ణనము-కందము.

క॥ ఫలములు పల్లవములు పు
వ్వులు తమశోకవింతయందవుఁ జిగినొసఁగన్
మలయపవమానుఁ డటురాఁ
బిలిచినపాంథులఁగఱంచుఁ బ్రీతిన్ వనముల్.

(3) సమస్య.

తే॥ గీ॥ "సంధిసేయంగవచ్చుఁగృష్ణభగవానుఁ
డతనిదర్శించి ధన్యుఁడనగుదు" ననుచుఁ
దలఁచెధృతరాష్ట్రుఁ డాశౌరిదయనుజేసి
(కన్నులబ్బెను ఫలమునుగాంచెనదుట).

(4) నిషిద్ధాక్షరి. అవధానకార్యభారము-కందము.

క॥ ధారణగలుగఁ గవిత్వ
స్ఫారపటుత యొసఁగ బుద్ధి బల మలరారన్

ధీరుఁడు కరణసమర్థుఁడు
గూరుచటువధానము కడకుఁ బరుఁడగునే?॥

(5) వ్యస్తాక్షరి.

అమరానిర్జరా దేవాస్త్రిదశావిబుధాస్సురాః

(6) ఏకసంథ.

ఉ॥ హారివిచిత్రహేమకవచావృతుఁ డున్నతచాపచారు దీ
ర్ఘోరుభుజుండు భాస్వదసి తోత్పలవర్ణుఁడు సేంద్రచాపశం
పారుచిమేఘ మోయనఁగఁ బాండవమధ్యముఁ డొప్పెబద్ధతూ
ణీరుఁడు రంగమధ్యముననిల్చి జనంబులుతన్నుఁ జూడఁగన్

(7) అధికప్రసంగము.

(8) గంటలు. 37.

అభినందనాశీర్వాదములు.

తే॥ గీ॥ అఖిలవిద్యలకును నుపాధ్యాయినియయి
నిఖిల దేవతాజన వందనీయమైన
భారతీదేవి తనదు పావనకృపావి
శేషము సతమ్ము నీపయిఁజిలుకుఁగాత.

మ॥ ఒకనాఁడైన వధానముఁ మనసులో నూహించియుండాక
యుం! చుకయుఁ నీవలవాటుసేయకయెయుచోఁ నేఁడుప్రా
జ్ఞాళి పా।యుకసంతోషమునొందఁ దక్షులు మహాహ్లాదంబు

సంతృప్తిఁ బొందికఁ దక్షుల్ మెచ్చ నవధానముల్ సలిపి తెంతే కీర్తి
నీయుండవై!

చ! పలుకఁగవచ్చుఁ గాని పలుభాషణముల్ సభలోన నల్పిత
జ్ఞులు మది మోదమంద సరసుల్ తలలూఁపఁ గవిత్వచాతురీ
విలసనముల్లసిల్లఁ బలువృత్తములల్లి యవధానకార్యముల్
సలుపుట యేరికిన్ సులభసాధ్యముగా దు తలంచి చూడఁగన్.

చ! అదరుచునుండె నా హృదయమన్న! యవధానము నెట్లు పూర్తి సే
యుదువో యటంచుఁ గాని యిపుడూరట మిక్కిలి విస్తరిల్లె నె
మ్మది ముదమందె శీ మిగుల మాన్యతఁ గాంచితివీవు నేఁడు నా
హృదయము పేర్మిఁ జేసి రహియించె వికాసము నొందితమ్ముఁడా!

చ! వయసునఁ బిన్నవాఁడవు సభాసదులందఱు నిన్నవధానమే
తెయిసయినన్ రచింపనియమించిరి నీవు నుదీసిపోక ని
ర్భయముగఁ జేసి తేనును భవద్గురుఁడున్ ముదమొందినారము
య్యా! యగునుగాక నీకు సుజిరాయువుఁ గీర్తియు నెప్డుఁ దమ్ముఁడా.

చ! పలుగురుగూడి యుత్సుకమనమ్ములఁ బొంగుచు నేఁడు నీయశో
విలసనముగ్గడింప వినువిశ్రుతభాగ్యభరప్రమోదముల్
వెలయఁగఁ జేసితయ్య, సుకవిప్రవరుల్ మును మెట్టినట్టి త్రో
వలఁ జరియించి గ్రంథములు వ్రాసి యశంబు గడింపు తమ్ముఁడా.

మ! వరవాచావిభవంబు రంజిలఁగ శశ్వచ్ఛైలి యేపార సా
రరసాహ్లాద శతావధానము కవీంద్రశ్రేణి యొందుఁ బ్రమో

దరసాంభోనిధిఁ దేలఁగాసలిపి యోతమ్ముండ! యేనాఁడున
త్పరిషత్పూజ్యుఁడవౌదొ నాకును బ్రమోదవ్యాప్తిగల్గించు
చుఁడీ।

తే। గీ॥ అన్న! నీకగుఁగాక దీర్ఘాయురాప్తి
నీకుఁ జేకురుఁగాక యనింద్యకీర్తి
విహితరత్నము! నీదు కవిత్వసరణి
యఖిలకవిమాన్యమై యలరారుఁగాక॥

డి. రాజశేఖరం

—o—

24-4-1919 ప్రొద్దుటూరులో బ్ర॥ రూపావతారం
శేషశాస్త్రిగారి యింటియొద్ద జి. వెంకటశేషశాస్త్రి గారొన
రించిన యష్టావధానవిధానము.

---

మ॥ కరుణాపూరముఁ జిమ్ముకన్నుఁగవతో గంగాంకశీర్షమ్ముతో
ధరకన్యాయుతమూర్తితో నభయముద్రాశస్త్రహస్తంబుతో
సరసస్వాంతముతోడ భక్తులకు సాక్షాత్కారమై తోఁచు శం
కరుఁడస్మన్మనమం దఖండకవితాకారమ్మునన్ దోఁచుతన్.

ఉ॥ ఆయతశక్తి లోకముల నాదిసృజించెడు భారమన్న నీ
దేయగు భావనాబలసమృద్ధినొసంగెడు విద్య నీయఁగా
నాయుదిభారమంచు నలినప్రభవున్ ముదమొందఁ జేయు భ
ద్రాయతనంబు వాణి కవితామృతధారల వెల్లిఁగొల్పుతన్।

ఉ॥ మంచియుఁ జెడ్డయుం దెలియుమాన్యు లనూయ యెఱుంగ నట్టియ
భ్యంచితు లుత్తమంబుగ రసారసచర్చయొనర్చి తప్పులెం
క్కించక యేగుణమ్ము గ్రహించి ముదంబువహింతు రుగాన న
య్యంచితులైన పెద్దలఁ గృతాంజలినొంచు నమస్కరించెదన్

## —♦ అ వ ధా న ము. ♦—

(1) వధూవరులకు వెంకటేశ్వరుని యాశీర్వాదము.

ఉత్పలమాల.

ఉ॥ కోరినకోరికల్ జనులకుం గడుదీక్షనొసంగి వారిచే
సాగతరార్థముల్ గొనువిశారదుఁ డీశుఁడు వెంకటేశుఁడి
చ్ఛారతినీవధూవరులసంపదలిచ్చి చిరాయువిచ్చి యా
పూరితసౌఖ్యమిచ్చి సతముం దయచిప్పిలఁ బ్రోచుగావుతన్.

(2) సమస్య.

ఉ॥ వార్ష్ణ్యవరుల్ విపణ్ణులయివందురుచుండఁగనింగినుండి దై
వార్క్ష్యము చేతవచ్చి తనదట్టపు రెక్కలువిచ్చి సర్పజై
షార్క్ష్యమునన్ ధరాస్థలికిఁ గక్కనడిగ్గఁగవచ్చునాతనిన్
దార్క్ష్యునిఁ జూచినంతరఘునాథుని పాములువీడిపోయెఁగా.

(3) సభ్యులవర్ణనము - చంపకమాల.

చ॥ కవితయెటుల్ పచించునొ వికస్వరశబ్దములున్నవో ధృతిన్
దవిలియయుండునో యిటవధానము నెట్టులొనర్చునో యటం

చవిరళకౌతుకమ్మున దయామతులైననుజూచుచున్నగౌ
రవయుతులైనసభ్యులఁగరంబునువర్ణనసేయఁజెల్లదే?

(4) నిషిద్ధాక్షరి. వాయుదీపవర్ణనము

తే॥ గీ॥ వనలోకవెలుం గొకవెలుంగు దివిరిరేయి
భువినివెసశుభకాండముల్ పోఁదిసేసి
వెలుఁగఁ జేయు నిర్వారిపుడుగలిసి దీప
మందు రెండుభాగములుగానలరుదురిట.

(5) అధికప్రసంగము.

(6) వ్యస్తాక్షరి.

గంగాతరంగకమనీయజటాకలాపం.

(7) ఏకసంధ.

తే॥ గీ॥ ధారణాధోరణులు మనోహరిగతుల
బెరయు రసవంతమగుపద్యవితతియలర
నీవధానంబు సభ్యసంభావనీయ
మయ్యె, వెలలేనియానందమయ్యెమాకు.

(8) గంటలు 33.



17-12-20 తేది ప్రొద్దుటూరు కారనేషన్ భవనమున
మ॥రా॥శ్రీ యన్. యస్. నృసింహాచార్యులు బి. ఎ. బి. ఎల్.
డిస్ట్రిక్టుమునసబుగారి యధ్యక్షతతో జరిగిన యష్టావధానము.

---

మ॥ వనజాతాక్షపితామహాదికసువర్వశ్రేష్ఠకోటీర పం
క్తినితాంతోజ్జ్వలరత్నసంచయకళానీరాజనశ్రీల శో
భనమై పావనమై వెలింగెడు భవత్పాదాబ్జముల్ మానసం
బునధ్యానించెడువారికెందునఘంబుల్ లేవు కామేశ్వరీ.

మ॥ సరసోదారపదార్థభావరసవిజ్ఞానంబు చేకూర్చి, వ్యా
కరణంబున్ దగఁ ఛందమున్ మదికినెక్కన్ నేర్పి, శిష్యాళిన
న్నరయన్ బుత్రకురీతిగాఁగనినదాసాచార్యవర్యుండు మ
ద్గురుచూడామణి; యమ్మహాత్మునకు మ్రొక్కుల్ పెక్కు
లర్పించెదన్.

చ॥ గురువులఁగొల్చి దేవికృపకొంతకుఁగొంతగడించి,విజ్ఞులన్
సరసుఁడటంచుఁదన్బొగడ, సంస్కృతమందుఁదెలుంగునం
దు, ద
స్తరతరపాండితిన్ వెలుగుసత్కవి, వెంకటశేషశాస్త్రి సో
దరువలెనండనుండ నవధానవిధానమదొక్కటెక్కయే.

మ॥ కవినో లేదొకపండితోత్తముఁడనో గానయ్య, దేవీకృపన్
గవసంబించుకవ్రాసి సత్కవియనంగాఁగొంతపేర్గంటి, నీ

యవధానంబులొనర్చి యేనెఱుఁగ, సౌమ్యంబౌకృపాదృష్టి
మీ! రవలోకించి కృతార్థుఁజేయఁగదరయ్యా! సభ్యచూ
డామణుల్.

డి. రాజశేఖరం.

మ॥ కవిలోకంబుకలంబుఁ గైకొనుచుశ్లోకంబొందఁ బ్రాయంగఁ
బూ!న విలీనంబగుభావనోర్మికలనూత్నస్ఫూర్తిఁ బ్రేరేచి న
వ్యవికాసంబులనీజగంబుసృజియింపన్ నవ్యసాహాయ్యవై
భవముల్ గూర్తువు నీకుబిడ్డలము లోపంబున్న కామేశ్వరీ!

మ॥ అవధానంబులొనర్చు కార్యమున విద్యాపాటవస్ఫూర్తి సా
ఁవివేకంబుపరిశ్రమంబుగలుగన్ బ్రారంభముల్ జేయవ
చ్చు, వృథావాక్కులఁగాదుసుండియిదియాశుప్రక్రియన్
గువ్వచో
నెవియెట్లానావధానవేత్తలకు వేఱే తెల్పఁగానేటికిన్.

మ॥ తనవాగ్వైభవమూఁతగాఁగొని, కవిత్వవ్యాప్తియందెందు
జం। టనెపన్ బాయకనిల్చి, క్రీడియెడఁగృష్ణస్వామియై,
నాకతం। డనిరుద్ధిన్ జయమిచ్చుతోడికపి, నాప్రాణంబు
నాభ్రాత నేఁ। డనుమానస్థితిరాజశేఖరుఁడు ప్రాపైయుండ
లోపించునే?.

జి. వెంకటశేషశాస్త్రి.

యనుదారన్ గురుదక్షిణాత్మకముగా నర్పించి మచ్ఛిష్యతా
స్ఫురణంబించుక తెల్పినల్పైనమనస్సుల్ ధన్యవాదంబులున్.

సాలుజో డిచ్చినప్పుడు చెప్పినది.

శా॥ నెయ్యంబొప్పబహూకృతిన్ నలిపి యొంటె భక్తి శ్రీ సాలుజో
డీయన్ బూనితి వల్దనంగ సరియౌనే? నిహితంబట్టిదో
యయ్యా! కొప్రపుటన్వయాంబునిధిచంద్రా! సుబ్బ సు
శ్రేష్ఠీ! మె
మెయ్యన్ జేకొని సంతసించెద మునీయుల్లంబు మోదింపఁగన్.

అవధానాంతమునఁ గవులు చదివినపద్యములు.

శ్రీశారదాయైనమః.

బ్రహ్మశ్రీ డి. రాజశేఖరము గారికి, వందనములు.

శా॥ అయ్యా! మిత్రకవిత్వయుంబ! యిటమీయష్టావధానం
బునే! నొయ్యన్ జూచి ప్రమోదవీచికలలో నోలాడు భా
గ్యంబు దా! న్వెయ్యిన్ రెడ్లసభాగ్రమైచన నవార్యంబయ్యెఁ
గార్యంబిటుల్! నెయ్యార్ద్రిచ్చను సత్కరించుత సభావిద్వ
జ్జనంబుల్ మిమున్.

తే॥ గీ॥ శతవధానవిధానని స్తంద్రకీర్తి
సరసకవిచక్రవర్తి యాశుగమునందె
స్వర్గసంవాసి తిరుపతిశాస్త్రిగారు
ఆంధ్రభువి కాకొఱంతమీరార్తిగాక.

తే॥ గీ॥ తిన్నఁగాఁగూర్చుచుండి సంపన్నమైన
శైలిలోఁ బద్యములువ్రాయ క్షమామూర్తులు
తనవులేకున్కి నేవొ దడదడగవ్రాసి
పంపుకొన్నాఁడ క్షమియింపవలయునయ్య!

ఇట్లు, మీవత్స,
బాలకవి కసిరెడ్డి వెంకటసుబ్బారెడ్డి, పర్లపాడు.

---

బ్రహ్మశ్రీ డి. రాజశేఖరముగారికి.

చ॥ లలితమృదూక్తులన్ గవితలన్ రచియింతురటంచు శేముషీ
విలసితులార! మీయశము వీనులవిందు నెకాని యిప్పుడీ
పలువురనుధ్యనిల్పి ప్రతిభన్ బ్రకటింపుచుఁ జాలబుద్ధి శ
క్తులనవధానమున్ సలుపఁ గూడెను సంతసమెంత యేనియున్.

తే॥ గీ॥ దత్తమండలియం దవధాన మిటుల
నింతవఱకుఁ జేసినవారి నెఱుఁగనయ్య!
యాంధ్రభాషావధానికి నత్యంతకీర్తి
పెంచితిరి మీరు, మాకెల్లఁ బ్రియముగలిగె.

ఉ॥ ఒక్కఁడనింటనుండుచు మహోజ్జ్వలశైలిని గైత వ్రాయుచే
యక్కజమైన కార్యమగు, నాబుధసంయుతమౌ సభాస్థలిన్
జిక్కులఁ జిక్కకుండఁ దన చెంగటి పృచ్ఛకులేమికోరినన్
జక్కఁగఁ గల్పించి పనిసాగఁగఁ జేయుట యెంతకష్టమో.

వి. శంకరరావు, బి. ఏ బి ఎల్.
ప్లీడర్.

ఉ॥ వింటినె కాని చూడఁగలవిశ్రుతభాగ్యము లేదు కీర్తి న
వ్వంటినసచ్చరిత్రుల సదాకులఁదిర్పతివెంకశేషులన్
గంటిని నేఁడు మీరిటనొనర్చినయీయవధానధాటి, మీరా
నంటికవీంద్రులీకడప వైపునఁగల్గునె రాజశేఖరా!.

ఆ॥ వె॥ శీలయుతులు రాజశేఖర వెంకట
శేషకవులతో విశేషకీర్తిఁ
గడపమండలంబు ఘనకీర్తిఁ గాంచుచు
దత్తమండలముల ధన్యమయ్యె.

క॥ అవధానకార్యమెంతయు
సవలీలగఁ దీర్చుమీకు నాయువుపెరిఁగి యున్
గవితాబలమును గమలా
ధవుఁడిచ్చును గాక సుకవితల్లజులారా.

వి. వెంకటరామానుజాచార్యులు.
ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు.
శేషసల్ హైస్కూలు, ప్రొద్దుటూరు.

—o—

తే॥ గీ॥ పుడమిఁ శోభిలు ప్రొద్దుటూర్ పురమునందు
బహుళవిద్వత్సదస్యులు బహుమతింప
సల్పిరష్టావధానంబు సన్నుత రాజ
శేఖరబుధేంద్ర వెంకటశేషకవులు.

ఉ॥ పావనశాస్త్రబృందములఁ బర్వుచు నుత్కనసంప్రియంబునై
భావవిచిత్రితగోవ్రజ విభాసితమై విలసత్ఫలాగమా
పవిత్రమై శుకాదిపదసీమ యనన్ రుచికెక్కి దివ్యసం
భావన నొప్పి సంఘవని భాసిలె సీకవిసింహవాగ్ఝరిన్.

శ్లో॥ న్యస్తనిషిద్ధయతాక్షర। యతవృత్తాంఘ్రి ద్యూర్థకవనేన
గీర్వాణాంధ్రసమస్యా। పూర్త్యాచాష్టావధానమతులమిదం.

శ్లో॥ కవితా సువర్ణకలితా। లలితాలంకారవృత్తగుణసహితా
కంఠగ్రహయోగ్యాసా। వనితేవా భాతి కుసుమమాలేవ॥

ధన్నవాడ రాఘవాచార్యులు,
విద్వత్కవి సాన్స్క్రిట్ పండిట్,
నేషనల్ హైస్కూలు, ప్రొద్దుటూరు.

—o—

మహారాజశ్రీ రాజశేఖర వెంకటశేషకవులకు.

మ॥ కవిరత్నంబులు! ప్రొద్దుటూరుపురి విఖ్యాతప్రమోదంబుమై
సవధానంబులు సల్పి సభ్యులమనస్సమ్మానమున్ జెంద నా
శువిశేషాంధ్రకవిత్వనిస్తులయశశ్శోభాయమానంబుగా
నవలీలన్ విలసిల్లు మీ చదువు కత్యంతంబు సంతోషసం
భవమైత్రిస్ఫురణాంచిత ప్రచురవిద్వద్గోష్ఠిఁ గాంక్షించితన్
స్తవనీయుండగు రాజశేఖరుఁడు నిత్యశ్రీసమేతుండుగా
నవునా వెంకటశేషశాస్త్రియు, భవిష్యద్వృద్ధిపాండిత్యగా

రససంపాదనకేళికావిలసితాంధ్ర గ్రంథనిర్మాణ స
త్కవితాకీర్తి నిరంకుశప్రభయు విద్యావంతులౌ మిమ్ము నీ
భువిసర్వజ్ఞుఁడు పొందఁజేసివిపులప్రోత్సాహముల్ గొల్పనా
యువునారోగ్యముసంపదల్ గలిగిమీరుప్పొంగవీక్షించుచుం
టల్। మిత్రులన్ గోరుచు నీశ్వరున్ గొలిచెదన్ మిత్రద్వ
యానిచ్చలున్ ॥

ఇట్లు, ఆంధ్రభాషాభిమాని,
కోరంకికుప్పుస్వామయ్య,
డిప్టికలెక్టర్, జమ్మలమడుగు.

—o—

మ॥ పదియున్ దొమ్మిదివందలిర్వదవయబ్దంబుల్ డిసెంబర్ నె
లన్। బదునేడౌతగు తేది మీరిచట విద్వద్బృందముల్ మె
చ్చి స। మ్మోదమొందంగ వధానముల్ సలుపు నింపుల్ సొం
పుపెక్కింపఁగా। మదిసంతోషతరంగితంబయి రహింపన్ గం
టిసీవేళలో.

మ॥ పలుకుల్ జాజులుచల్లుచందమునభావస్ఫూర్తి దైవారి ము
ద్దులుగుల్కంగ రసంబుచిప్పిలఁగ నెంతో మెత్తనౌ శైలి రం
జిల సౌలభ్యముమీఱఁ గను 'కవితాశ్రీ' వైభవారూఢిభా
సిలఁ బద్యంబులుపుష్పగుచ్ఛముల వాసిన్ జెంగియుండన్
సము। న్నతులున్ వర్ణనముల్ రచించి యటుపైనన్నింటి గం
భీరమౌ। గళరావంబునఁబల్కు శక్తికయి వేడ్కల్ గల్గె; సే

నన్ని చో। టులనో యష్టవధానముల్ గనిన నిట్లుఁ సంతసం
బీయఁగాఁ। గలదే దేనియు లేదటంచుఁ బలుకంగా నేస్తు నో
సత్కవుల్.

మ॥ వరవాచాసకవిత్వ సంపదలతో భాసిల్లు నో రాజశే
ఖరవిద్వత్కవి! శేషశాస్త్రికవి! వేడ్కన్ మీరు మీ ప్రొద్దుటూర్
పురమున్ వీడి విదేశముల్ చనిన కేంద్రముల్ పొల్చువిద్వత్ప్రభాం
తరముల్ చేరి శతావధానములు వందల్ వందలున్ జేయుచున్
గరము చ్చోటిబుధప్రపంచమును నానందాబ్ధిలోఁ దేల్చి భూ
వరులర్పించెడు కానుకల్ గొనుచు శశ్వద్గౌరవోపేతులై
ధరలో నాయువు శ్రేయమున్ సిరియు విద్యాబుద్ధులున్ గల్గి
యుం। డుడుగాకంచని కోరుచుండు మనమందున్ మీకు
శ్రేయోర్థినై ॥

కె. చంద్రశేఖరం,
Deputy Superintendent of Police,
Jammalamadugu Division.

---

బ్రహ్మశ్రీ రాజశేఖర వెంకటశేషకవులకు, వందనములు.

ఆ। వె॥ ఆర్యసభల మీర లష్టావధానంబు
సలుపు ప్రతిభ మెచ్చవలయుఁగాదె?
చిత్తమందు రాజశేఖర వెంకట
శేషశాస్త్రి సుకవిసింహులార!.

మ॥ హనుమత్స్తోత్రము భూతపంచకయుతంబై యుండఁ గల్పింపుఁడం। చనుచుం బృచ్ఛకుఁడేర్పడం బలుకఁగా నత్యాశుధారాగతుల్। తనరారం మృదుశబ్దభావరససిద్ధంబైన ధారాళ్యై। లిని గంధంబురచించు మీకవన మేలీలం నుతింగాంచదే?.

తే। గీ॥ ఒక్కబుధుఁడొక్కపాదంబు నొక్కసారి
చదువ మున్నభ్యసించినసరణి దాని
లవము పొరపాటులేక చదువుటచూడ
మీరసజ్ఞను శారద మెలఁగఁబోలు.

కొడవలూరు రామచంద్రరాజు.
రామేశ్వరము.

—o—

అవధానాంతమునఁ బ్రసిడెంటునుగూర్చి చెప్పినది.

సీ॥ అనుపమానప్రౌఢి నాంగ్లేయభాషలో
బీ. యే. బి. యల్. ప్యాసు వెలయఁజేసి
సర్వసన్నుతమైన సంస్కృతభాషలోఁ
జక్కనిపాండితి సంగ్రహించి
యాంగ్లేయమున నుపన్యాసమిచ్చెడుచోట
'నారేటర'నెడు విఖ్యాతిఁగాంచి
యెల్లవారలుతన్ను నెంతయుఁబొగడఁ జే

ర్గనినట్టి న్యాయాధికారియగుచు
తే॥ గీ॥ గర్వమింతైన లేక న౯గనినయంత
వేవిధంబులమన్నించి వెలయువాని
నాదుయజమాను నగ్రాసనపతి ఘనుని
జేరివినుతింతు యు౯, యస్, నృసింహావిభుని.

డి. రాజశేఖరం.

Proddutur.

M. R. Ry. D. Kalahastayya Pantulu Garu alias Rajasekharam has been intimately known to me for some years past. It was a most pleasant and agreeable surprise to me when I found that he had concealed within himself, unknown to the world, hidden treasures of the highest poetry in the Telugu language. The citizens of Proddutur had his true worth drawn out, when they pursuaded him, to give a performance in Avadhanam. I had the good forture to preside on that occasion. He kept the audience spell bound and in raptures by his remarkable feats of memory and to the last man in the audience, who had any tinge of the music of poetry in him, the feeling was one of a transport of joy and exstacy. In these days when telugu is so little cared for, it is a matter of pride and gratification to all lovers of Telugu and the Telugu people, that there are still amongst us people like Rajasekharam, who hold aloft the torch of telugu poetry,

pure, unsullied, and ever bright and shining. I wish him every success in his endeavours to leave a permanent mark, in the annals of Telugu poetic literature and pray that he may receive fitting and adequate recognition at the hands of the enlightened public.

(Sd) N. S. Narasimha Chari.
District Munsif.

—o—

డి. రాజశేఖరముగారికి.

ఉ॥ ఔ భళి! రాజశేఖరబుధాప్రతిమప్రతిభాప్రభావ వా
గ్వైభవసాత్త్వికత్వనవగానవధానవిధానలీలలన్
భూభవనప్రసిద్ధకవిపుంగవశోభితమైన యీమహా
ప్రాభవగోష్ఠియందు నినువర్ణనసేయుటన్నశక్యమే?.

చ॥ స్థిరగడియారమన్వయజశేషయశాస్త్రిగళారవంబు మీ
స్ఫురదురుకంఠరావమును భూరిరణంబునఁ బార్థసృష్ట శం
ఖరవములట్లు శత్రులవికాసమడంచుచు వెల్గియుండు భీ
కరమయి, యాప్తసంతతికి గాఢముదంబుఘటించుచున్
సభన్.

చ॥ తిరుపతి వెంకటేశ కవిధీరవరాష్టవధానలీల మీ
యిరువురయందుఁ దోచెనని యిద్ధమనస్కులునైనచంద్రశే
ఖరులను సత్ప్రభుల్ నుడువఁగా విని సంతసమందినాఁడ మో
వరకవివర్ణనీయ తమ భవ్యవధానచరిత్రముల్ సభన్.

సి. చెన్నారెడ్డి.
పగ్గపాడు, 8-1-1921

ప్రొద్దుటూర్పురమున 17 తేది శుక్రవారము సాయంతనము ఆరుగంటలకు బ్రహ్మశ్రీ రాజశేఖర వేంకటశేషకవులు నూతనవిధానమున అష్టావధానమొనరించిరి. సభ్యులు పూర్వపండిత సాంప్రదాయము ననుసరించి యీపండితకవులకు నూటపదియాఱను సాలువులునిచ్చి బహూకరించిరి.

ఆంధ్రపత్రిక 22-12-20 బుధవారము.

---

20-2-1921 తేది జమ్మలమడుగులో జరిగిన

ద్విగుణితాష్టావధానము.

---

మ॥ అమరగ్రామమునుండియయ్యణువుపర్యంతంబుగా నీప్రపం
చమునందంతటనిండిసర్వమునకుం జైతన్యముం బెంచి లో
కముఁ గల్యాణపుమండపంబుగ వెలుంగం జేయుచున్నట్టి
యాదిమశక్తిన్ నినునామనంబునను భక్తిం గొల్తుఁగామేశ్వరీ.

చ॥ అలఘుదయార్ద్రభావముననంతటనింకటుబిల్చినీవు నె
ప్పలుకనుఁగాచుటేని శుభంబగుమాడ్కినిజూచిప్రోతువం
తలఁపుబలంబుగాఁగ నవధానముసేయఁగనుంటినన్ను నీ
బలమునుఁజూపుధారణముపట్టునఁగాంచ్చిమదిన్ సనుంబరా!

డి. రాజశేఖరం.

శా॥ కాళీదాసుననుగ్రహించుట మొదల్గా సత్కవుల్ నీదయా
శ్రీలేశమ్మున రాజరాజనుతలై జెన్నారుచున్నారు మా
కేలాయన్యము? నీపదాబ్జభజనం బేకోరియున్నాము మా
తా! లాలింపుము కీర్తిసంపదల నత్యంతంబు చేకూర్చుచున్.

మ॥ కరుణాపూరముఁ జిమ్ము శాంకరికటాక్షంబింతతో నైజ విక
స్వరవాగుజ్జ్వల సంస్కృతాంధ్రపటుభాషాకావ్యనిర్మాణ
చా। తురికశ్రీకవితావిలాసమెపుడున్ దోపించి విద్వత్సభా
దరణీయంబులు సేయు భావరసవిత్తంబైన మా సూక్తులన్.

మ॥ భవపత్నీకరుణాత్తచారుకవితాప్రాలంబమున్ బూని య
ష్టవధానంబు శతావధానమును ప్రజ్ఞాచాతురీసాధ్యవై
భవముల్ వెల్గు వినోదతంత్రముల విద్వత్పాళి మెప్పించు ధీ
జవమున్ ధైర్యబలంబు వాక్పటుతయున్ స్వాభావికంబై
తగున్

జి. వెంకటశేషశాస్త్రి.

ద్విగుణీతాష్టవధానము.

1. నారపురస్వామి వర్ణనము - ఉత్పలమాల - క ప్రాసము,

ఉ॥ శ్రీకరుణాపయోధి సరసీజదళాయతలోచనుండు ర
త్నాకరుకూర్మియల్లుఁడు నిజాశ్రితకోటికిఁ గన్నతండ్రి య
స్తోకనిశాటదాహకుఁడు శూరుఁడు జమ్మలమడ్గుపట్టణ
శ్రీకరుఁడైన నారపురి శ్రీపతి నెంతుము మానసంబులన్॥

2. అవధానమునుజూచి చదువురానిపల్లెటూరివాని యభిప్రాయము.

ఉ॥ ఆకవితామహత్త్వమదియందఱుమెచ్చుచునుండ్రుగానియిం
ఱేకత సెప్పనుండిరో మఱెవ్వరునుఁ బలకొట్టలేద నే
నీకడఁజూచువాఁడనని యొందువధానపువేళలోన భ్రాం
తాకృతిపల్లెటూరిజనుఁడతుంహీనుఁడుచూచునెంతయున్.

3. అధికప్రసంగము.

4. సభ్యుఁడిచ్చిన యింగ్లీషుకల్పన–చంపకమాల.

చ॥ స్థిరతరధాటితోనరుగుదెంచుభుజంగమపఙ్క్తిఁబోలెఁ బె
న్నుసువులతోఁదరంగము లనూనగతిన్ గిరిఁదాఁకివచ్చి తా
విరతినిబొంద సూర్యలిపవిత్రకరమ్ములవెల్గుచుండె బం
గరుఁగరఁగించినట్లుకడుఁగ్రమ్మపుఁగాంతులసంద్రమయ్యెడన్

5. దశావతారములు–కందములో.

క॥ వనచరచతుష్టయము వా
మనుఁడును రామత్రయంబు మహితుఁడుబుద్ధుం
డును గలికియు ననఁగా వి
ష్ణునియవతారములు పదియు శోభిలుచుండున్.

6. సమస్య.

క॥ దివిజగురురాణియయ్యెను
నవనవముగువయసుపొగరునన్ ధర్మ్ముఁదా

నవమానముసేయుచుఁడా

(ర విధునితోఁగలిసె ధిషణరహితయగుటచే॥)

7. సమస్య.

ఉ॥ శూరతతోడఁ బోరి రిపుసూదనతన్ బొనరించి రాజ్యమున్
గోరికతోఁ గ్రహించియుసఖుల్ సుతులున్ మఱిపిన్న పెద్దలున్
జేరిసుఖింపలేమిఁ గడుఁజింతమునుంగుచు గెల్పుగాంచియున్
భారతయుద్ధరంగమునఁ బాండవకృష్ణులెయోడిరేకమై.

8. ఘనము 6128487 మూలము 183.

9. ఘనము 12487168 మూలము 232.

10. నిషిద్ధాక్షరి.

క॥ అలఘుకవి వితతియలరఁగ
మలసి చలువచేసిమది నమంద్రముదంబున్
గలుగన్ జేయును మరునకుఁ
జెలి మలయానిలము నిండుచెల్మిఘటిల్లన్.

11. వ్యస్తాక్షరి.

యావత్తోయధరాధరాధరధరాధారాధరాభూధరా.

12. మాజిక్ స్క్వేరు 86.

13. గంటలు 51.

14. తే॥ గీ॥ కూర్యాబురూటునమదినెలకొల్పువంకె
లొక్కశిలనవ్వఁ జెట్టుననున్న కాకు

తెగిరిచనురీతి మదినుండి యెగిరిపోవు
విబుధవర! గంటవేసిటు జ్ఞప్తికిని జేటు.



నూటపది యూరులిచ్చి సన్మానమొనరించినపుడు చెప్పినవి.

మ॥ ధనధాన్యంబులు మాకుఁ గాళికృపచేతన్ దృప్తిగా నుండె, నీ
ధనమే ముఖ్యము గాదు మాకు, ననవద్యంబైన యా సద్యశో
ధనమే ముఖ్యమయ్యావధానములనున్ ద్రవ్యంబు లేకుండ జేఁ
సినఁ దద్గౌరవముండ దందుక తనన్ జేకొందు మీ మాల్యముల్

మ॥ తనపైఁ గూర్మిని సత్సభాసదులు శ్రద్ధాభక్తులన్ దెచ్చియి
చ్చినదానిన్ దృణమైన మేరువనుచున్ జిత్తంబునం దెంచి తృ
ప్తినిగన్ వాఁడె ఘనుండు; మీ రిడిన దే వేయూరులంచున్ మ
నం। బున భావించి ముదంబుఁ గాంతుము సుఖంబుల్ మీకు
సంధిల్లఁగన్.

మ॥ తొలుదొల్తన్ లలితంపుఁ బల్కులను ముద్దుల్ దద్దయున్ జిల్కు కై
తల వ్రాయించుచుఁ గూర్మిమై మనిపితంతన్ గావ్యముల్ నా
టకం। బులు వ్రాయించితి పైవధానము జనంబుల్ మెచ్చఁ
జేయించినా। వలఘు ప్రేమను జూపునిన్ బొగడ శక్యంబా ని
కామేశ్వరీ!

డి. రాజశేఖరం.

మ॥ కవితాకార్యములన్ గలట్టివిలువన్ గన్గొంచు మాచేతనీ
యవధానంబొనరింపఁజేసి ముదమత్యంతంబుపొంగార శే
ఖువులున్ బైననుగప్పినూటపదియార్లున్ గాన్కలర్పించిగా
రవమున్ జూపెడునీసదస్యులయుదారస్వాంతమెన్నన్ దగున్

శా॥ ఏకాంతంబునమద్గురూత్తములు తామేమేమిబోధించిరో
లోకుల్ సుంతయెఱుంగరావగిది; మాలోనీవువేంచేసి వా
చాకలోలములన్ వధానసభలన్ జాల్కొల్పిపేరిత్తు మా
తా! కానిమ్మనుబైనఁద్రిప్పుమిఁకసంస్థానమ్ములన్ శాంకరీ.

జి. వెంకటశేషశాస్త్రి.

అవధానమైన పిదపఁ గవులు చదివినపద్యములు.

శా॥ అమ్మా! జమ్మలమడ్గుపట్టణమ! మా శాస్త్రావధానావలో
కమ్మబ్బన్ గద నీదుపుణ్యమున నీకై సంతతశ్రీవితా
నమ్మందంగ నితోధికంబుగ మునన్ నారాపురస్వామిపా
మ్ముదల్ మ్రొక్కెదనేఁగృతజ్ఞుఁడనమైదాక్షిణ్యధర్మాస్పదా.

శా॥ అయ్యా; రెడ్డిసభార్థమై చనుచు మీయష్టావధానంబు ద
వ్వయ్యెన్ నాఁడటప్రొద్దుటూరుపురమం దానాటిదీనాటితోఁ
దియ్యంబై ద్విగుణీకృతంబయి రసోదీర్ణ ప్రకారంబుగా
వెయ్యార్లందినయంతసమ్మదముఁ బర్వెన్ మిత్రవిద్వద్ద్వయీ.

తే॥ గీ॥ సప్తసాల విభేదనచణము రామ
శరము; దానికిసాటి నిశాతమైన

ధీని శేషము మీకుఁ బ్రాప్తించు కతన
మేటియవధానులకు ముందు మేలు మీకు.

తే॥ గీ॥ మిత్రుండానందవశమున మితముదప్పి
సంస్తవము సేత యది యనాచారమగుటఁ
దావకవధానవిజయ మింపలిబుధేంద్ర
వికసితముఖారవిందముల్ వెల్లడించు.



ఇట్లు, మీ సత్స,
బాలకవి. కసిరెడ్డి. వెంకటసుబ్బారెడ్డి.



ఉ॥ ఇప్పటికాలమందు మనమింగ్లిషుబాషను జీవితంపుఁ బెఁ
దెప్పగఁజూచి దానికయి తీరనికష్టములొంది ద్రవ్యపుఁ
గుప్పలు పాడు చేయదొరకొందుమె కాని తెలుంగుబాసయం
దెప్పుడుగాని శ్రద్ధవహింపుటఁగఁ బూన మిదేమిపాపమో?

మ॥ కయనీయంబగు నాశుధారదనరంగాఁగ్రైతలన్ గూర్చి శ్రా
వ్యములౌ కంఠరవంబులన్ జదివి విద్యార్థులౌ సభ్యులన్
అమితానందమునందుఁ దేల్చిన మనీష్యగ్రేసరుల్ మిమ్ము శ్రీ
ప్రమదానాథుఁడు బ్రోచు నెల్లపుడు సంపచ్ఛ్రేయముల్ గూ
ర్చుచున్.



వి. శంకరరావు, బి. ఏ., బి. యల్.
ప్లీడరు.

క॥ ఎందఱు పండితు లడిగిన
నందఱకు సదుత్తరముల నతినైపుణితోఁ
బొందికఁబలికెడిమిముఁ గవు
లందఱు మెచ్చంగఁదగు మహాకవులారా!

మ॥ కవితాశక్తియుమంజుశబ్దము లలంకారమ్ములున్ భావముల్
కవులౌరాయనిమెచ్చఁబద్యములుపల్కన్ నేర్చు మీవంటి స
త్కవిసింహంబులు దత్తమండలములన్ గల్గర్ సుడీయంచు నే
శ్రవణానందముగాఁ దెల్పెదసుధీచంద్రుల్ ముదంబందఁగన్

♦ ♦ ♦

క॥ కరుణాకరుఁ డీశుఁడు శుభ
చరితుల మిము నాయువును యశంబును బలమున్
సిరియొసఁగి ప్రోచుఁగావుత
సరస లలిత సుకవితా విశారదులారా!

ఇట్లు మీవిధేయుఁడు,
కొట్టుపాటి పుల్లయ్యకవి.



శ్లో॥ రాజశేఖర శేషాఖ్య కవిపుంగవ నిర్మితాం
శతావధానకవితా మద్రాక్ష మతికోమలాం.

శ్లో॥ శ్రీమజ్జమ్మలమడ్గు నామకపురీ నారాపురశ్రీవతే
రభ్యర్ణే శతసంఖ్యపృచ్ఛకముఖోదీర్ణం సుగూఢాశయం
యుష్మత్ప్రోక్తకవిత్వకౌశల మనాయాసం సమస్యోత్తరం
శ్రుత్వాఽతుష్యమమందమాంధ్రవిలసద్గీర్వాణభాషాఝరీం

శ్లో॥ రామానుజార్యనామక సుధియావిభిమాయధార్థపరికథనే
అభినందనపద్యయుగం దత్తంసుకవీంద్రయుగళయుమ్మ భవ్యం

తే॥ గీ॥ దత్తమండల సముదాత్త వృత్తగత్ని
సదృశులై చెలువొందిన సత్కవీంద్ర
యుగళి మీ కేమిబోదవ? సంయుక్తగరిమ
సకలరాజన్యసభల నుత్సవముఁగనుఁడు.

రామానుజార్యః,
మోరగుడి.

ఉ॥ ఇక్కవితాకుమారికకు నిద్ధమునన్కతఁ గన్నతండ్రులౌ
తిక్కనసోమయాజియు సుధీయుతనన్నయభట్టులీలఁ బెం
పెక్కినరాజశేఖరకవీ! గడియారము శేషశాస్త్రి! మా
కక్కజమౌగతిన్ ద్విగుణితాష్టవధాన మొనర్చి నారహో.

చ॥ స్ఫురదురు కంఠరక్తి పరిశోభిత మంజుకవిత్వశక్తి సు
స్థిరతరబుద్ధిశక్తి ధృతిశీలదయాద్యనురక్తి యారయన్
దిరుపతి వెంకటేశకవిధీరవరేణ్యులయందుఁబోలె మీ
యిరువురయందుఁదోఁచెడిను మీముఖసంస్తుతిగాదు సత్యమౌ.

మ॥ నలువా జన్మ్నలమ ద్దదీచి విలస న్నారాపురస్వామి కే
వల దేవాలయమా! భవత్సుకృతముల్ వర్ణింపమా సాధ్య
మా। తలలున్ వేయుగలట్టియాతఁడ తనిన్ దాఁదాల్చు నా
తండు నె। చ్చెలులై వాఙ్మయగోష్ఠిసల్పిరహహా శ్రీమద్వ
ధానందులై ।

మ॥ అలసత్స్వజ్ఞతసత్కులస్థితియు భవ్యాంగీకృతార్యత్వమున్
లలితైశ్వర్యము శేషభావ్యతయుఁ గల్యాణప్రదత్వంబునున్
గలసీకున్ గవిరాజశేఖర సమాఖ్యన్ గల్గు నాద్యక్షరం
బులు రెండున్ దుదివ్రాయు హేతువది యేపో శాళహస్తీశ్వరా.

ఉ॥ చందురుఁ డాకసంబునను జల్లఁగ వెన్నెల గాయుచుండఁగా
ముందరఁ గాచగర్భగత భూరిసితద్యుతి దీపముల్ దగన్
మంప సుఖాసనసంపద సమస్త జనాస్యము లుల్లసిల్లఁగా
నిందుకర ప్రసారమున నెంతయు సైకత సీమ యొప్ప, నా
నందము మీర నుత్తర పినాకిని నిర్మల తోయ సంచర
న్మందసమీరుఁడచ్చటఁ గ్రమమ్మునఁ బుష్పపరాగమెల్లెడన్
గ్రందుగఁ జల్లుచున్ విసరఁగా మఱి యెన్నిది గంటలప్డు నాఁ
డందుల కేగుదెంచు జను లందఱు గద్దెను దమ్మి రేకుల
ట్లందము మీరఁ జుట్టుకొని యచ్చెలువా యక యద్భుతంబుగా
డెందములందు మోదము కడిందిగ నూనుచు సుందరఁ బృచ్ఛకుల్
నందియ మింత లేక కడు సన్నుతి నొందుచు మందమారుత
స్పందిత కల్పవృక్షముల భాతిని శీర్షములూపుచున్ సభన్
గొందరు సైసెబాసనఁగఁ గొందఱు సంపశిసేయు రాదు తా
ల్పింపమటంచుఁ బల్కుచు నవీనముదంబుధిఁ దోలలాడఁగా
ముందుగ నీగళారవము మోహన మోహనరాగయుక్తమై
సందడి యింత లేని జనసంఘము వీనులవిందు సేయఁగాఁ
మందమనోజ్ఞహాసరుచి మాన్య భవద్వదనారవింద మిం
దిందిర బృందమట్టులు నతిస్థిరసభ్య సమూహ దివ్య ద

గ్బృందములాదరింపుచుం దదేకగతిన్ గనుపెట్టియుండఁగా
జందన గంధ చంద్రికర సాంద్రసుశీత శిరీష మార్దవా
మంద మరంద సన్మధుర మాధవ కుంద పరీమళా నిశా
నందక శబ్దజాల వచన ప్రచనాయుత హృద్య పద్యముల్
మందులనైన మేల్కొలిపి మాటికిమాటికినింపుగూర్చి యా
నందరసాబ్ధిఁ దేల్చుచు మనంబులఁ జూరఁగొనంగనిండు మో
మందునయంబునందభినయంబులయందును మిమ్ము సజ్జనుల్
వంది జనంబు చందమున వర్ణన సేయఁగఁ గోటిమన్మథా
నంద విలాస విగ్రహత నట్టుకొనన్ వరగోష్ఠి ధీరతన్
సుందర కందరాయుత యశోయుత మందర శైలమట్టుల
స్పందగతిన్ రహించుచును భద్రగజేంద్రములీలనిర్ణయా
నందితమందమంద రమణీయగతిన్ నటియించుచున్ భళా
యిందిరకిక్కలై తనరునీక్షణపంక్తులఁ బ్రసన్నరించుచున్
జెందిన వేడ్కనన్నుచటఁ జెన్నకవీయని! హెచ్చరించుచున్
గుందమనోజ్ఞదంతరుచి గోముగు మోమునలంకరించుచున్
గందవినీలగాత్రుఁడును గాంచనచేలుఁడు శ్రీముకుందుఁడా
నందకరుండు మాధవుఁడు నారపురీశుఁడు మోదమందఁగ
న్నందిర సీమఁ జేసి తవధానమున్ గవిరాజశేఖరా
ఖ్యందగుదంచు సభ్యజనులాశిరి సత్కవి పద్యసన్నుతుల్
గొందఱవాఙ్ముఖమ్ములును గోముల పుష్పకదామభూషలిం
పొందెను మాకు మోదరసమూర్జితమయ్యెనుజత్త్రపద్మముల్
కందళతన్ రహించెడిని గావున నీవు బుధాళికెందునున్

వింటివు రాజశేఖరకవీ! నిను నీసఖు శేషశాస్త్రి నె
న్నందరమే సరస్వతికి నల్వకు వేయిమొగాలచిల్వ కా
యిందుధరుండుమాధవుఁడనేకశుభంబులుగూర్చిప్రోవఁగా
మందురుగాత సద్బుధ సమాదరణమ్మునఁ జారుకీర్తులై.

ఇట్లు,
చెమికెల చెన్నకవి,
పర్లపాడు.



తే॥ గీ॥ పూలుచల్లిన కరణి సొంపులు జనింప
లలితశబ్దార్థములఁ బద్యములు వచించి
గారవించితి రంతయోగ్యతలు లేవు
కడుఁగృతజ్ఞులమయ్య మీయెడను మేము.

డి. రాజశేఖరం.

చ॥ కవులము పిన్నవారము వికస్వర చారుకవిత్వతత్వ వై
భవమును దేవిశాంకరి కృపారతి నించుకగాంచినాము మా
కవనవిభుత్వ మెట్టిదొ ప్రగాఢముదమ్మునఁ బద్యరత్నగా
రవమునొసంగినారలు కరమ్ముఁగృతజ్ఞులమైతి మోబుధుల్.

వెంకటశేషశాస్త్రి.

Jammalamadugu.
21—2—1921.

My dear friends.

Even though I had known you for some time I had absolutely no idea of your talents. I must confess you took me by great surprise yester-

day. I had been in the past witness to many an avadhanam. But the one which you gave us yesterday was unique in many respects. Your exhibition of వ్యస్తాక్షరి and న్యస్తాక్షరి was as austounding as it was a great marvel. I am certain you have got a great future before you. Jammalamadugu has every reason to be proud of you. It can no more be said what good can come out of Badsia. Jammalamadugu is the brith-place of our famous Andhra Valmiki, who has given to the world that monumental work "Andhra Valmiki Ramayana". You contribute no less to the fame of Jammalamadugu. Your fame will be an additional halo added to the lustre of your brith-place. Jammalamadugu watches and follows your career with just pride and interest. There is nothing like success. I pray that it may be my previlege and that of Jammalamadugu to hear that you have risen from success to success. May the Lord of the Flute bless you is the heart-felt prayer of

Your admirer,
A. Venkata Subba Rao,
Sub-Registrar.

---

ఈనెల 20 తేది జమ్ములమడుగు పురమునఁ బ్రొద్దుటూరు పురవాసులు బ్రహ్మశ్రీ రాజశేఖర వెంకటశేషకవులు అవధానము నత్యంతమనోహరముగ నొనరించిరి. ప్రొద్దుటూరు, పర్లపాడు, ఉప్పలపాడు, కొట్టపాడు లోనగు పురములనుం

డి పలువురు మహాశయులు విచ్చేసియుండిరి. పురవాసులు అవధానులను బుష్పమాలాలంకృతులఁ జేసి నూటపదియారు సమర్పించిరి.

ఆంధ్రపత్రిక,

ఫిబ్రవరి 25 శుక్రవారము.



13-5-1921 తేది నెల్లూరు పురమున మ-రా-శ్రీ. తేకుమళ్ళ అచ్యుతరావు బి. ఏ, యల్ టి. గారి యధ్యక్షతతో లక్ష్మీనరసారెడ్డిగారి పురభవనమున నొనరింపఁబడిన ద్విగుణితాష్టావధానవిధానము.



శా॥ శ్రీవిద్యామహనీయ రాజ్యపదవీ సింహాసనాధ్యాసినీం
దేవాధీశ్వర సంతతప్రణత దివ్యత్పాద పద్మద్వయీం
భూషాభూత మనోజ్ఞబాలవిధు రేఖాభాసి శీర్షస్థలాం
త్వాం దేవీం హృదయే భజామి సతతం శ్రీరాజరాజేశ్వరీం.

మ॥ ఒనరింపుండవధానమంచు మొదలో హాసంతసంబయ్యె మీ
జననస్థానము లేటికింకఁ బరదేశాల్ చొచ్చి కావింపుడం
చనియా మైమముఁ బ్రోత్సహించినిరతంబస్మద్యశోవ్యాప్తి పె
ంపనుగాంక్షించెడుతల్లి శాంకరిపదద్వంద్వంబు భావించెదన్.

మ॥ కవితాపాండితి బ్రహ్మతుల్యులకు వేడ్కన్ గాపురంబీపురం
బవుమున్నంతటిసద్బుధేంద్రులకు గీర్మైత్రొప్పునీనాఁడు మే
మవధానంబొనరింప నుంటిమిటనే యుందంబుదై వారఁగాఁ
గవితన్ సాగఁగఁ జేయుచుంటివొ జగత్కల్యాణి! కామేశ్వరి!

రాజశేఖరం.

శా॥ శ్రీమాతా పర దేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ
సంగీతాగమ ఖేలనైకరసికా సాహిత్యసంవిన్మయీ
నిత్యానందపరా సమస్త జగతాం చైతన్యరూపాపరా
మచ్చిత్తే లసతామఖండకవితా రూపేణ కామేశ్వరీ!

మ॥ సిరులన్ గీర్తికి వెచ్చపెట్టిన యశస్విద్ధుల్ కవిబ్రహ్మలున్
సరసాగ్రణ్యులు శౌర్యఖడ్గచతురుల్ సత్కీర్తి నిండారిబాం
పిరివోఁ గూర్చిన యీపురంబున సభాపీఠమ్ము మాకిచ్చి సం
బరమున్ గూర్చితి నెగ్గఁ జేయఁగదవమ్మా! తల్లి! కామేశ్వరీ!

మ॥ అవధానుల్ గడుఁ బిన్నవారలదిగాకా పశ్చిమాంధ్రావనీ
కవులీపట్టణపండితాళిఁ దను వంగా నేర్తురే యంచు లో
నవిశంకింతురొ యేమొ కొందరటులైనన్ వారిమెప్పించువై
భవముల్ నీకెటుఁ గంగరానివె మదంబా! తల్లి కామేశ్వరీ!

వెంకటశేషశాస్త్రి.

## ద్విగుణితాష్టావధానము.

1. ఇప్పటిభాషనిప్పటి కాలపుఁగాంతలతోఁ బోల్చి శార్దూలము,

శా॥ భావంబుల్ రసపుష్టియున్ మఱియుశబ్దంబుల్ సువృత్తంబు
లున్। భావాకర్షకమానలంకృతులెలర్పన్ నేటికాలంపుకాం

తావృత్తంబులఁజూచి నేర్చివన హృద్యంబైనభాషావధూ
టీవృత్తంబు రచించునూత్నపరిపాటిన్ నేటికాలంబునన్

2. ఈయెండలకు స్థూలకాయునిస్థితి వర్ణనము.

శా॥ తైలస్నానముచేయుచందమునసత్యంతంబు దేహంబునన్
జాలున్వాఱఁగఁజెమ్మటల్ వయినఁగ్రిందన్ జెమ్మలోదున్న
నాఁ॥ గ్రాలంగాఁ దగనూపిరిన్గొనుటకేకష్టంబుగానెండలు
ద్వేలంబైతగువేళ స్థూలతనుఁడెం తేఁదాపమున్ బొందెనున్.

3. సమస్య. ✓

మ॥ కనుసన్నన్గొలుపంగ నొప్పితి వలంకారమ్ములన్బంప వే
డ్కనుగైకొంటివిపూవుసెజ్జదరియంగారమ్మటంచున్వయ
స్యను బుత్తెంచితి నమ్మివచ్చితి గటాక్షంబింతలేనట్టి చె
య్వునేనో (యుత్పలగంధిరోయిపుడునీవూహూయనన్ బా
డియే?)

4. సమస్య. రికార్డు లేదు.

5. నిషిద్ధాక్షరి. రికార్డు లేదు.

వ్యస్తాక్షరి.

6. ఆకంఠకరటిడుంఠి శ్రీకంఠజగండ మదమషీచంద్రకితా.

7. ఘనము 184220009 మూలము 569.

8. మాజిక్ స్క్వేరు 1063.

వారములు చెప్పుట.

9. (13-4-1908) సోమవారము.

10. (4-10-1883) గురువారము,

11. (8- 6-1904) బుధవారము.

12. గంటలు 41

13. అసహాయోద్యమము భారతముతోఁ బోల్చి వర్ణనము.

సీ॥ ఆపత్కరంబు కిలాపత్సమస్యయే
దుష్టచతుష్టయ ద్యూతసరణి
పాంచాలమానినీ పరిభవస్ఫూర్తియే
పాంచాలనృపసుతా పరిభవంబు।
ప్రకటభారతమహీ స్వాతంత్ర్యలాభంబె
తమకు రావలసిన ధరణితలము
చెరసాలలందుఁ జొచ్చియుఁ గృశించుటయె క
ర్కశగహనావాస కష్టసమితి
తే॥ గీ॥ యవల దౌర్జన్యరహిత విఖ్యాతమగుచు
మహితమౌ నసహాయోద్యమము గుఱించి
యిట్టిదని వివరింపఁగా నెవరితరము
ధీరవరులార! యది పెద్దభారతంబు

స్వర్ణపతకము లిచ్చినపుడు చెప్పినవి.

శా॥ ఏజన్మంబునఁ జేయు పుణ్యమువనో యిప్డీకవిత్వంబు రా
గాఁజెల్లెన్ జుమి యట్లుగాక యది కల్గన్ బోనిచో గంటలీ
మాజిక్ సేక్రూరులు కర్మ్యబురూటులును సన్మానమ్యంబు లే
యౌనె యం! బా! జాంబూనదమున్నఁగాదె మణులున్
భాసిల్లుభూపాకృతిన్.

శా॥ ఆఱున్నూఱను వెచ్చపెట్టుచువివాహంబందునన్భోగమున్
నీరేజాస్యలఁబిల్వనంపి సభలన్నృత్యంబుఁ జేయించునా
చారంబున్విడి యావధానముకవుల్ పైపైయునన్గూర్చియా
యారాజ్యంబులమార్గదర్శివయితయ్యా! వీరభద్రాహ్వయా

డి. రాజశేఖరం.

మ॥ ధనమా! యెవ్వరికై ననుండునది విస్వశ్వతపాతంబు నీ
ధనమైయుంటఁగుమారుపెండ్లికయిశ్రద్ధాభక్తులొప్పారమ
మ్మునురావించుచు నీవధానవిజయంబున్గూర్చిమాకీర్తియె
ప్డునుగాంక్షించితి మెప్పుగాంచెను మనంబుల్వీరభద్రా
హ్వయా!

జి, వెంకటశేషశాస్త్రి.

అవధానమున కవ్వల విబుధులు చదివిన పద్యములు.

మ॥ అవురా! యష్టవధానతంత్రము మనీషాఢ్యుల్కవిత్వాభిలి
ష్యవులౌ సభ్యులు మెచ్చసింహపురిసంపూర్ణప్రభావాధికో
త్సవసంధాయకమై యెలర్పఁగను దీక్షాదక్షతన్ సల్పిరీ
యవధానుల్వ్యవధానముంచక రసవ్యాపార మేపారఁగన్

దీపాల పిచ్చయ్యశాస్త్రి.

♦ ♦ ♦

శా॥ ఏకార్యంబునదత్తమండలములెంతేముందుకున్ రాకయెం
దోకన్పట్టెడి మూలనంచనువసంతుల్ మాన్పిమీరిద్దర
ష్టోకశ్రీక కవిత్వవైఖరుల మెచ్చున్ జెంది మీమండలం

జేకొం కారయశంబునొందునటుహాయిఁ జేసి నారి యెవ్వడఁ.

ఇట్లు,

ఎఱ్ఱము రెడ్డి బాలకృష్ణారెడ్డి.

---

మ॥ కవిచంద్రుండగు వెంకటేశ్వరుఁ డుపోద్ఘాతంబుఁ జక్క వ్రాసినీ
కవితన్ వీరమతీచరిత్రమున వేడ్కన్ మెచ్చియుండంగ అ
ష్టవధానంబొకడాచరించినసభ కున్ సంతోషముఁ గూర్చు కా
ర్యవిశేషంబన రాజశేఖర విచిత్రంబౌనె యెవ్వారికిన్.

చ॥ ఘుమఘుమ కమ్మవాసనలు గొల్లలుగొల్లలు చిమ్ముపుష్పగు
చ్ఛములటు సత్ప్రబంధముల సత్వరతన్ రచియింపఁగల్గునా
ధ్యసుహిమసైజమయ్య గడియారము వెంకటశేషశాస్త్రి నీ
సుమహితపాండితీమహిమ చూచిన మెచ్చరె యెట్టివారలున్.

అ. కోటీశ్వరశర్మ.

---

డి. రాజశేఖరముగారికి వందనములు.

తే॥ గీ॥ కార్యశాలమ్మునన్ జిక్కి కడవడాఁటి
కదలలేకుంటిఁ గడుపుతో గంపెడాన
కలదుగాకేమి మీచేతఁగల వధాన
సరణి నూహించి యిప్పట్ల సంతసింతు.

శా॥ సారజ్ఞుల్ గలసత్సభాంతరమునన్ సామగ్రిసంపన్నమై
సారస్యంబునలోటువుట్టదుగదా సైసైయనన్ ధీరతా

శ్రీరాణఁ గయిదండ యొసఁగ జయశ్రీవచ్చి పూవండతో
మారాముళ్లోకయింతలేక మిముసన్మానించి పెంపావుతిఁ.

తే। గీ॥ బాలవాగ్వృహ్మవాక్కని పదుగురలర
బాలకవి చిన్నియామాట పసిడిమూట
యై భవదవధానవిజయ మచ్చటి బుధ
వికసితముఖారవిందముల్ వెల్లడించు!

బాలకవి-కసిరెడ్డి వెంకటసుబ్బారెడ్డి.

—o—

To,

The Cohinoors of Proddutur.

Dear Poets !

I cannot better voice forth my humble feelings for the pleasure you have given me at Nellore and on more occasions than one, by your Dwigunithastavadhanam on 13-5-1921, which beyond all doubt was a remarkable exposition of what India was in her past and what it is even in its present trampled condition and lastly what it can be in the future; than by the following few lines which I am sure will make you accept a friend's gratitude.

Sonnet.

Bees hum where honey lies in plenty
Why? to get most out of what can be had.
They drink and drink till the lake is empty
And find after all that they are but sad.

Thou wort with us and much more in us all
Many a man have I often times seen
As pictures passing in a gaiety hall.
So was they presence though short it had been
The clouds obstruct our vision of sun
When off they go the light once more we get.
So too with you learned poets! we run
To take what we can from thee but fail yet.
Lessons I take from your glorious life
Be brave, hold fast the good, life is a strife.

Sincerely yours.
P. V. SUBBARAO.



13-5-1931 తేదీ సాయంకాలము నెల్లూరు పురభవనమున మ॥ టి. అచ్యుతరావు బి. ఏ. యల్ టిగారి యధ్యక్షతక్రింద ప్రొద్దుటూరు పురవాసులును విఖ్యాతావధానులును నగు బ్ర॥ రాజశేఖర వెంకటశేషకవులు ద్విగుణితాష్టావధానము నొనరించిరి. సభ మిక్కిలి జయప్రదముగ జరగెను. పుష్యరాగ ఘటితములైన స్వర్ణపతకములిచ్చి యవధానులు సన్మానింపఁబడిరి. అవధానుల పాండిత్యకవిత్వపటుత్వములకు మెచ్చి బ్ర॥ దీపాల పిచ్చయ్యశాస్త్రి వినుగొండ కోటీశ్వరశర్మ లోనగుకవులు గౌరవపద్యములు చదివిరి. వీరి యవధానముఁ జూచు భాగ్యము గలిగించినందులకు ప్రొద్దుటూరు సబ్ మాజస్ట్రేటు పి. వీరభద్రరావుగారెంతయుఁ బ్రశంసార్హులు.

ఆంధ్రపత్రిక. 27 మేనెల శుక్రవారము.

ల్వతా! రలు తలనూవసాఁగె భ్రమరంబులు తామరయుండ్ల
కేగె బ! ల్చిలుకపటానిరాతు తనసింగిణివింట లకోరిఁ గూ
ర్చె నా! జలరుహామిత్రుఁడ స్తగిరి చాటున డాఁగురమూఁ
తలాడఁగన్.

14. గౌరీస్తుతి. చంపకమాల

చ॥ అతులసమస్తదైవతచయంబులు గొల్వఁగఁబొల్చు దేవియా
శ్రితనిజభక్తకోటికి నశేషవరంబు లొసంగుమాత పా
వితమతి రాజశేఖరనువేంకటశేషకవీంద్ర వాగ్గరీ
నుత వరదేవతాసతి మనోజ్ఞపదంబులఁ గొల్తుమెప్పుడున్.

16. నేరముచేయని దేశభక్తుని బాధించినపుడు జనుల మనసు
లెట్లుండును.

చ॥ శితకరవాలసంఘములు చేకొని దేహము చీల్చినట్లు లు
న్నతమగుకొండనుండి భువనంబునకున్ దిగఁద్రోయునట్లు దు
ర్మతి యధికారియొక్కఁడపరాధమెఱుంగని దేశభక్తునిన్
వెతలను బెట్ట లోకులపవిత్రమనమ్ములు తల్లడిల్లెడున్.

17. సమస్య (గంధిని రతికేళిఁదేలఁ గడుమనసయ్యెన్.)

క॥ బంధురసద్గుణఖని వ్యా
ద్ధబంధుఁడ! వనిలోనఁ గనిన తరళాక్షిని బు
ష్పంధయవేణిని సారస
గంధిని రతికేళిఁదేలఁ గడుమనసయ్యెన్.

19. సరస్వతీప్రార్థనము.

మ॥ కరుణాపూరము దేరి దేఁగలుగఁ బ్రాజ్ఞశ్రేష్ఠుఁడౌ మందుఁడుఁ
సురలుఁ మానులుమ ర్త్యలేనతి నమస్సుల్ చేసి శోభింత్రు భా
స్వరవిద్యాఖని యైన మాత కవితుస్వాంతైకదీపంబు నా
సరసీజాసనురాణి వాణి కవితాసామ్రాజ్యముఁ గూర్చుతఁ.

అవధానాంతమున.

మ॥ జనముల్ బల్కుదురింటఁ గెల్చినను రచ్చఁ గెల్వనౌనంచుఁ
గా। పున నిప్పట్టునఁ గల్గుపండితవరుల్ పూదండలుఁ మంచి
చం। దన తాంబూలములిచ్చి మమ్ముఁ గడు సన్మానింపఁ
గా నిండువే। డ్కనుగావించితి మీవధానము సుమాశారు
ణ్యవీతోద్ధృతిఁ.

రాజశేఖరం.

---

జంబులమడుగు తాలూకు నెమళ్ళదిన్నె బ్ర॥ జి. వెంక
టశేషశాస్త్రిగారి స్వగ్రామము. అట్లగుట మాస్వగృహమున
మేము విలాసమునకై యొనరించిన యీయవధానమున మా
హృద్బంధులును నాప్తమిత్రులు నొసంగిన బహూకృతిపద్య
ములు కావలయుననియే యిందు ముద్రింపించియుండలేదు.

డి. రాజశేఖరం.



10. ఒక్కఁడైన గాంధి యేమిచేయఁగలఁడు. మత్తేభము.

మ॥ అలఁతుల్ గోట్లకు నేలతీర్చునొకఁ డుదవ్యత్యాప్తర స్థైర్యుండు ని
శ్చలుఁడై కార్యముఁ, గో నివర్తనము నాశక్రాత్మజుండొ
క్కఁడే! సలిపెన్ రాముఁడొకండె మూలబలముల్ జక్కా
డె నా గాంధి యు! జ్జ్వలధీశాలి మహాత్ముఁడొక్కఁడయినన్
సాధించుఁ గార్యమ్ములన్ ॥

11. గ్రీష్మర్తువర్ణనము చంపకమాల.

చ॥ తొలకరివాన లేదెదఁని తొందరఁ గాపులు నింగిఁజూడ ని
ప్పులుమియు నెండలున్ బసనముల్ భయదాకృతిఁ గానుపింపనీ
ఖుల కమృతత్వకీర్తి దగ లోకము తీవ్రవిధాన వాఁడగా
వెలసెను గ్రీష్మమంచలు విప్లుతపించుచునుండ నీ మొనన్,

12. చెన్నకేశవస్వామి స్తుతి.

ఉ॥ శ్రీమహిళామనోహరుఁడు శీతమయూఖుని మేనబావ ను
త్రాముననుంగుఁ దమ్ముఁ డసురప్రతిపక్షుల పాలిమృత్యు వు
ద్దామ యశోధురంధరుఁడు తామరసాక్షుఁడు చెన్నకేశవ
స్వామి దయాసుయుండు సరసంబగుమార్గాని మిమ్ముఁ
బ్రోచుతన్ ॥

13. సాయంకాలవర్ణనము చంపకమాల

చ॥ పులుగులు గూండ్లఁజేరె పలపుల్ గుబుకన్ వికసించెఁ గ

## 26-6-1921 తేది నెమళ్లదిన్నెలో జరిగిన

## శతావధానవిధానము.



మ॥ లలితా! నీకృపనుంతయేని యును గల్గఁ బోని వేళ మహా
బలుఁడే నన్నని గడ్డిపోఁచను గదల్పన్ లేఁదు నీసత్కృపా
బలమున్నన్ గడు దుర్బలాత్ముఁడయినన్ బ్రహ్మాండ భాం
డంబు ముం। దలమోయన్ జుమి! నీవె సర్వమున కాధా
రంబు కామేశ్వరీ.

మ॥ నిరుపేదన్ జతురబ్ధివేష్టితమహీనిర్ణిద్రసామ్రాజ్యభా। స్వ
ఘుఁజేయన్ గల నీకృపాబలము మాపైనుండఁగాఁ గొంతు
నన్। బారపా టేటికిఁగల్గుఁ బృచ్ఛకముఖంబుల్ చూచు
మాతా ౹న ని। ర్భరగంగార్భటిఁబొల్చుకైతల నవర్ణా! మో
దముగూర్చ మే?

డి. రాజశేఖరం.

శ్లో॥ నమఃకామేశ్వర్యై త్రిభువనజనన్యై త్రిగుణతో
వ్యతీతాకారాయై వ్యసనదమనాయై సురవధూ
సమచ్ఛాదాక్రీడా కలితసుమమాలా మిళదళి
స్ఫురద్గీతీరీతీ తుషిత మనసే దివ్య మహసే.

జి. వెంకటశేషశాస్త్రి.

## —♦ అవధానము. ♦—

1. చంద్రోదయవర్ణనము సీసము.

సీ॥ ఐరావతంబు దివ్యాపగాంబులనుండి
పైకిన త్తిన సితాబ్జంబనంగఁ
గవ్వఁగొండ పాల్కడలిలోఁదరువఁగఁ
బుట్టిన నును వెన్నముద్దయనఁగ
వైజయంతోపరి భాగంబునందుండి
కొమరారు తెల్లని గొడుగనంగ
గగనహార్మ్యాగ్రభాగమునఁ గట్టగ నెత్తు
దీపైన పెను "గ్యాసులై" టనంగ

తే॥ గీ॥ నుదయగిరి శృంగభాగంబునుండి వెడలి
యెల్లెడలఁ దనకాంతుల వెల్లిగొలిపెఁ
గలువపూవులవిందు చక్రములకుందు
చక్కఁదనములసీమ యీచందమామ.

2. వివాహమునకు వచ్చినవారిని వర్ణించుట చంపకమాల.

చ॥ సరసులుబంధువుల్ హితులు సారవిధిజ్ఞులు బ్రాహ్మణోత్త
ముల్
సురుచిరరూపరేఖగల సుందరులున్ జతగూడి ముచ్చటల్
జరపుచు నైదునాళులును జాలముదంబునఁగూడియుండి శ్రీ
పరిణయగేహమందున వివాహమొసర్వసుఖాస్పదంబనన్.

29-8-21 తేది ప్రొద్దుటూరులో ఆర్కాడ శ్రీనివాసశాస్త్రి
గారి యింట జరిగిన శతావధాన విధానము.

---

మ॥ వరబంధూకసుమారుణాంబరము శుంభద్రత్నకాంచీకలా
పములుల్ పంకజపత్రనేత్రనయనద్వంద్వంబు సింధూరభా
సరితాంగంబు హిమాంశుచిత్రరుచిరాస్యంబొప్ప వేంచేసి
హృత్సరసీజంబున నిల్వవమా త్రిణయనీచంద్రార్ధచూడా
మణీ!

చ॥ చిరతరకీర్తి యుల్లసిల శేషయశాస్త్రి నెమళ్ళదిన్నెలో
విరచనచేసియుంటి మిటు వేఱొకచో నొనరింపలేము నీ
కరుణకు లోటులేనపుడు గన్పడ నేఁడు శతావధానమున్
సరసులు మెచ్చఁ దీర్చుచు యశంబును గూర్పఁగదమ్మ శాంకరీ

తే॥ గీ॥ చదువువారికిఁ బ్రతిపఠితు యదియెట్లొ
పద్మనేత్రలకును బ్రతిప్రసవ మెట్లొ
యోధులగువారికిని బ్రతియుద్ధ మెట్లొ
యావధానంబు లవధాని కట్లెయుండు.

రాజశేఖరం.

శా॥ సేవానమ్రసురాంగనాచికురపాళిన్యస్తమందారసూ
లాసారభ్యవిలోభ సంభ్రమదళిప్రారబ్ధ గీతారవః
పార్శ్వస్థాయి సమస్తసారనికరాంత ర్మోదమాపాదయన్
ప్రస్తౌతిప్రచురాంయదీయ విభుతాంతాంభావయేశాంకరీం

మ॥ తెలిదమ్మిన్ గొలువుండిమందిరమణి ద్వీపంబునన్ బ్రస్ఫు
ట। త్కాలికోల్లాసి కదంబసౌరభములన్ గల్లోలమాలాస
మా। కులమై తూఁగెడు పాలవెల్లియలలున్ గోస్కాల్ పిసా
ళింపఁగ। న్నలతేనవ్వొలికించునీముఖము గాంతున్దల్లి కా
మేశ్వరీ!

శా॥ తోడున్ నీడయుఁబోలె సత్సభల మాతోఁగూడ వేంచేసి
యె। వ్వాఁడున్ మమ్మెదిరింపలేనియటు వాగ్వైదగ్ధ్యముల్
గూర్చియే। జాడన్ సత్కవులుల్లసిల్లి తలలూఁపన్ గై తలల్లిం
చి మా। కైదక్కించెనవమ్మ కీర్తిధనముల్ కామేశ్వరీ!
శాంకరీ!.

వెంకటశేషశాస్త్రి.

అవధానము:

(1) సమస్య:

మ॥ అదయుండై చెలరేగి మన్మథుఁడు పుష్పాస్త్రమ్ములన్ జిమ్మె
డున్। గదియన్ వచ్చి సమీరభూతము కడున్ గారింపఁ జొ
చ్చెన్ ముదా। స్పదుఁడౌ చంద్రుఁడు శత్రుడయ్యెఁ గరమున్
బాధాకరంబయ్యెఁ గా। (ముది;పూఁబోఁడిరో। చెంతఁజేరఁ
గదవే మోమెత్తి మాటాడవే!).

(2). సమస్య:

ఉ॥ బాల్యమునందఁ బాయునెర ప్రాయపుటింతులచూపులోని
చాం। చల్యము లేఁతనవ్వు లలనంబగుయానము మర్త్యకో

టిక్। శాల్యముగూర్ప నబ్బురపులాగె? యహల్యకటాక్ష
తీక్ష్ణకా। (శల్యముగాదె యింద్రునకౌసంగె సహస్ర విశాల
నేత్రిముల్.)

5. దాక్షిణాత్యుల పర్యటనమునందలిపట్టుదల.

మ॥ చనఁగానేర్తురు దాక్షిణాత్యులు ధ్రువస్థానంబులన్ బేర్మి
మై। జననస్థానమొనర్చి పట్టుదలమెచ్చన్ వచ్చుఁదారార్ణ
ణచే। సి నిరూపింపఁగోలంబసయ్యమెరికా చేరంగ సుబ్బ
య్యరందునఁ గాఫీనిడిసత్కరించెనని యందుర్ పెద్దలాయా
యెడన్.

6. పృచ్ఛకుఁడిచ్చిన వాక్యమును వృత్తముగాఁ జెప్పుట.

మ॥ తతబొంబాయిపురంబులోఁగలియు విద్వన్మాన్యులౌ సర్వ
భా। రతజాతీయ సమాజసభ్యులు ధృతుల్ రంగారఁ శాసిం
చి రా। ప్రతమీరంగవిదేశవస్త్రముల సెప్టెంబర్ తుదిన్ జే
రులో। నతగున్ వీడఁగనెట్టివానికయినన్ నిక్కంబుగానం
చోగెన్.

7. ముగ్ధావర్ణనము.

శ్లో॥ ఆకృష్టాపి వశం నయాతిబలవ న్నోవీక్షతేలజ్జయా
వాక్యైఃప్రేమ పురస్కృతైఃపరిచితానోవాదదాత్యుత్తరం
అంకారోహణచుంబనాదికకళాస్వత్యంతమూఖాపరం
ముగాకస్యమనోనగంజయతి సా నూత్నైర్నవైశ్చేష్టితైః

8. చెఱకు, భారతము. చంద్రుఁడు నొకేవర్ణనమున వచ్చిన ట్లు కందము.

క॥ చెఱకును భారతకథయును
సరసిజరిపుబింబ మొక్కచందమయగు ని
ద్ధరలోఁ బ్రతిపర్వరస
స్ఫురణంబును మూఁడు పొంది పొసఁగుట కతనన్.

9. సమస్య.

శ్లో॥ తేథన్యాఃపురుషాస్సను స్తజగతాంసత్త్వైకనిష్ఠాత్మనా
కృచ్ఛ్రేష్వవ్యవకార దూరహృదయా శ్యాంత్యైకజీవాతవః
స్వీయంచావిగణయ్యకష్టశతముద్బుద్ధాఃపరశ్రేయసే
(యేదృష్టాఃపరమేశ్వరేణ భవతాతుష్టేనతుష్టేనవా.)

10. తానుజేసిన కేసు వదలిపోయిన యాతనివర్ణనము.

చ॥ "తొలఁగెను దేవుఁడా! తెలిసిదుండుడుకొప్పఁగఁజేతులారనే
సలిపిన నేర మిప్పటికి; చావుదినంబులు దూరమయ్యె; న
చ్చెలిగళసూత్రభాగ్యమది చెప్పఁగశక్యముగాదటంచు" లో
పలఁగుతుకంబు నొందుఁ దన పైఁగల నేరమువీడునాతఁడున్.

11. పర్వతములు లతల కాధారము. విపరీతముగా లత పర్వతము ల కాధారమైనది. భావప్రకటనము చేయుఁడు.

ఉ॥ ధారణిలోన నెందును లతానిచయంబులు పర్వతంబులా
ధారముగాగనిల్చుటలు తథ్యమునై జమ యాలతాంగి దా

చారుశరీరము౯ గనిన౾ జక్కనికొండలజంట యొక్కెడా
ధారముగా లత౯ గొనియె ధాతృవిచిత్రమదెట్టిదో కదా?

♦ ♦ ♦

14. పృచ్ఛకుఁడిచ్చిన భావము.

క॥ జనకుఁడు సీతను రామున
కనువుగనిడి పెండ్లిచేసినటు యమునాబా
యిని గృష్ణరావుఁ గూరిచి
ఘనమోదము శ్రీనివాసఘనుఁ డొందె మది౯.

15. అవధానమైన పిదప వెంకటశేషశాస్త్రి యత్యాశుధార
లోఁ జెప్పినది.

+ క॥ అక్లేశము బ్రహ్మము ని
త్యక్లీబత్వంబు గలుగు తత్వము తచ్ఛా
యాక్లిన్నమాయ త (ద్యో
షాక్లీబులు గూడఁ బుట్టె జగమెల్ల౯ దా౯.)

---

+ తొలుతఁ బృచ్ఛకుఁడీ సమస్య నియ్యఁగా నందు సవరణ మున్నందున వెనుకకొసంగితిమి. ఆప్రశ్నమును దిద్ది పృచ్ఛకుఁడు మఱల దానిని మాకొసంగక యవధానాంతమువఱకూరకుండి పిదప నావిషయమై ప్రస్తావించెను. అప్పుడు వెంకటశేషశాస్త్రి యత్యాశుధారలో దానిని౾ బూరించెను. ఆయాం యీావిషయములు మ॥ పరశురామరావుగా రొసంగిన యోగ్యతాపత్రమున౾ జూడఁదగును. రాజశేఖరం.

స్వర్ణపతకములు సన్మానముచేసినప్పుడు చెప్పినది.

శా॥ ఏలంజాపురినుండియొక్కొ ధనతారేశాస్యరప్పించి సం
గీతంబంచని నూత్నసూర్ణాసఁగు ఫక్కిన్ మానిమాచేఁగవి
వ్రాతింబుల్ పొగడన్ వధానము రచింపన్ జేసి రాష్ట్రాన
మాఖ్యాతింబెంచుచు మార్గదర్శివయితయ్యా! శ్రీనివా
సాఖ్యుఁడా!



కవులపద్యములు.

తే॥గీ॥ శ్రవణయుగ పర్వమంజుల శబ్దపుంజ
రంజిత నిరర్గళాశుధారా కవిత్వ
మానిత శతావధాన విధాన దివ్య
శేముషుల్ రాజశేఖర శేషకవులు.

చ॥ అతులపదార్థసంచయ సముంచితమై రసవంతమై మహా
మతివినుతంబునై వివిధమంజులవర్ణవికాసమై ప్రమో
దితసకలాంతరంగమయి దేవసమర్పణయోగ్యమై భవ
ద్వ్రతతకవిత్వపాకమది వీనులవిందొనరించె మాకిలన్.

శా॥ సారప్రశ్నసమూహమంథర మహాశైలంబుతో మీసుధీ
క్షీరాబ్ధిన్ మథియింపఁ బుట్టిన సమీచీనోత్తరాంచత్సుధా
ధారన్ గొంతమఱుంతపంచుచు, భవద్వాగ్జ్యోత్స్నహానీ దేవియిం
పారన్ దావిబుధాళిఁ జేసినుము సత్యానందముల్ జెందగన్.

చ॥ నిరుపమ శబ్దజాల రమణీయ మణీకమనీయ పద్యభి
త్త్యురుతరవాగ్విలాసగృహ మో జన మోహనమౌ విచిత్రవ
స్తురచన నింద్రజాల మొకొ సొంపుల నింపుగనించెమీరసో
త్తరకవితామహాద్భుతవిధానవధానవిధానముల్ గనన్.

క॥ సుకవితఁ జతురాననతన్
సకలప్రశ్నోత్తరముల సర్వజ్ఞతఁ బా
యక గణితం బచ్యుతతన్
సకలత్వము నతిప్రమతిని చందముచూపెన్.

క॥ త్రుటిలో నఘటితఘటనా
పటుతన్ ఘనయుక్తి సాధుభావంబును మీ
జటిలసమస్యాపూరణ
మటువలెఁ జూపించునే మహాత్ముండెవఁడున్.

సీ॥ సకలగూఢప్రశ్న సముచితోత్తర కామ
దానమానిత కామధేనువనఁగ
దోషైకదృక్క్రూర దుష్ప్రవ్యసనసంస్కృత
పదశిలాగుణ ధనసదనమనఁగ
స్వాశుధారాసారవర్థిత మతిసస్య
ముదితజ్ఞకర్షకాంబుదమనంగ
సనదృశామోదద రసమకరంద శో
భిత కవితానుమప్రతతియనఁగ
తే॥ నేకసంధాప్త వాక్పథ నైక కాల

గుణిత ఘంటారవాఖిల ప్రణుతిమంత్ర
పుష్పశబ్దిత విబుధాళి పూజయనఁగఁ
దనరె మీయవధాన విధానగరిమ.

సీ॥ వ్యస్తాక్షరిని మీరు వచియింప వింత మా
వచనముల్ వ్యస్తాక్షరచయమయ్యె
మీ నిషిద్ధాక్షరి వీనులఁబడఁగ వా
క్కులు నిషిద్ధాక్షరంబులుగఁ దనరె
లసదాశుధార కొల్లగవినఁ మా చెవు
ల సదా సుధారమై రసమునించె
నేకసంధాగ్రహాకౌశలంజూపఁ జి
త్తైకసంధాగ్రహులైరి రిపులు
తే॥ గీ॥ వెలయ ఘనమూలముగణించి తెలుప నదియు
నద్భుత వినోద ఘనమూలమయ్యె మాకు
నౌర మీయవధానము నన్యు లెన్నఁ
దరమె? ఘనశేషరాజశేఖరులు దప్ప

ప్రొద్దుటూరు
29-8-1921

ఇటు, కవిజనవిధేయుఁడు.
V. S Subramanya Sastry,
Sub Registrar.

---

Brothers Rajasekhara Venkatasesha Kavulu gave a performance this evening on the occasion of the marriage of my neice in the presence of a large audience, of satavadhanam consisting of many

items of feats of memory mostly of samasyas which were completed with great skill both in poetic composition and spirit, to the great surprise and immense satisfaction of all present within a short space of time and their descriptions of varied themes suggested, particularly the adventurous spirit of the Southern Tamil brothers, evoked much applause. One of the questioners with a view to test their powers of poetic composition gave a hard nut but it was objected to in the beginning on the score that the question required correction and the questioner did not choose to do anything but at the close of the performance he advised these poets to be not so very certain of their powers and wanted them to be modest by admitting their inability when they found the question to be difficult but the poets rose equal to the occasion and at once solved the Samasya (commendram) to the wonderment of all thus winding up the performance in a most fitting manner so much so that the questioner in showing his high appreciation of the unusual capacity of the young poets, composed nine stanzas and presented them immediately. This incident gave the performance such a turn at the end that everyone left the marriage hall with praise in their lips to the poets. They deserve special praise particularly, as they come from the ceded districts which the rest of the Andhra world think to be backward.

May the young Avadhanees be spared long to show their skill to those interested in Andhra literature and bring name and fame to their Native Districts.

Cuddapah. 29-8-1921. } A. PARASURAMA RAO, Pleader Vice President Dt. Board.



15-9-1921 రామేశ్వరమున వి. శంకరరావుగారి యింటిలో రాజశేఖరముగారు జరిపిన యష్టావధానవిధానము.



మ॥ అవధానంబులొనర్చు కార్యమున నేయాయాసముల్ లేక స॥ త్కవనంబల్లి సమస్తసభ్యులను మోదంబొందఁగాఁ జేయునా॥ త్నవిలాసంబు లెసంగమేలగు, భవత్కారుణ్య సంపత్తి మా॥ కవియెల్లన్ వశమయ్యె, లోటెదియు లేదంబా౹ గిరీంద్రాత్మజా!.

తే॥గీ॥ సభలయం దవధానముల్ సలుపువేళ
భార మఖిలంబుఁదాల్చి నాపజ్జ మెలఁగు
శేముషీశాలి వెంకటశేషశాస్త్రి
రాని లోపంబు నీవె తీర్పంగదమ్మ!

అవధానము.

1. పర్వతమును గురించి మత్తకోకిల.

ధారుణిన్ గలవస్తులన్నిఁటఁ దద్దపెద్దది యేదియో

భూరిధైర్యముపట్టదేని గవుల్‌కరం బుపమింతుర
ర్వీరుహాదివనౌషధీతతి వెల్గునెచ్చట నట్టి యా
ధారుణీధ్రగుణంబు నెన్నవిధాతకైననుశక్యమే?

2. సమస్య:

క॥ శ్రీవనజాప్త కులాంబుధి
జైవాతృకుఁ డసురవీర సంహారకుఁడుఌ
బావననాముఁడు నిర్జిత
(రావణుఁ డాసీతమగఁడు రక్షించుమిముఌ.)

3. అధికప్రసంగము.

4. నిషిద్ధాక్షరి, న్యాయవాదిని, వేశ్యకుఁబోల్చి కందము.

క॥ ధనమెపుడు కోరుదురు తి
య్యనిపల్కుల మోసమెపుడు నలరు వెలవెలం
దిని మింతురు నేరుపుగల
వనిపట్టఁదలంప న్యాయవాదులు ధాత్రిఌ.

5. వ్యస్తాక్షరి.

ల క్ష్మీ నృ సిం హా మ మ దే హి క రా వ లం బం.

6. ఘనము, 1906624. మూలము 124.

7. ఆంగ్లస్త్రీవర్ణనము, సీసము.

సీ॥ పలుచనైనయెఱుపుడా లలరుగులాబిపూ
వట్టులుండెడు చెక్కుటద్దములును

స్ఫటికపుశిలవోలెఁ బాండరప్రభలతో
బొదలెడు విడఁద నెన్నుదుట కుదుట
పగడంబుకాంతితో జగడించి యార్ద్రమై
తగు తరుణారుణాధరము సొంపు
పంచాస్యరాజంబు పరిహాసింపఁగఁజాలు
పిడికిటనడఁగు నెన్నడుము బెడఁగు
తే। గీ॥ వఱలఁ దనుకాంతితో సరస్వతిని మీఱు
తెల్లదొరసాని యందగ త్తియయె కాని
కనుల నలుపు మోమున బొట్టు కాళ్ళ సొమ్ము
లేమి జేసని మెచ్చఁగా లేము మేము.

8. గంటలు 27.

మ॥ భవజూటాతటనిర్గతామరసరస్వత్యూర్మిమాలామిళ
త్కవితానర్గళధారరంజిలెడు విద్వత్సత్కవిశ్రేష్ఠులి
య్యవధానంబులు లెక్కసేయుదురె? మాతా! యంత
యుఁ నీకృపా। లవసంధానితమంచుఁజిత్తమున నాహ్లాదంబు
గాంతుఁ జామీ!

23-11-1921 తేది ప్రొద్దుటూరిలో బ్ర॥ అవధానము
నరసయ్యగారి యింట జరిగిన యవధానక్రమము.



శా॥ పెన్సిల్ పట్టఁగరాదుఃకాగితముమున్నే లేదుఃగ్రంథాలతోఁ
గన్సల్ చేపనునున్నఃకిమ్మనుచుఁబల్కఁజైమునఁ నాస్తిఃప్ర

శ్నస్సంరంభముతో నెదుర్కొనుచుశశ్వద్ఘాటినత్యాశుధా
ర నాసంతంబుగఁజెప్పఁగావలెబుధేంద్రవ్రాతమా నానన్

రాజశేఖరం.

శా॥ నీకారుణ్యబలంబు నమ్మియెభవానీ! యెవ్వారేఁగోరిన
న్నాకర్యంబును లెక్కసేయ కవధానంబు౯ ఘటింపంగని
ర్భీకంబౌగతినొప్పుగొందు మిదితప్పైయైన మన్నించుచు౯
జేకూర్పం గదవమ్మ నీదయ జయశ్రీ నేఁడు కామేశ్వరీ!

వెంకటశేషశాస్త్రి.

అవధానము.

(1) సమస్య.-

క॥ అమ్మరుఁడు త్తల పెట్టెడి
నెమ్మదినిలువంగవశమె నీవును నేనే
యిమ్మేడఁగలము బంగరు
(బొమ్మా! నీకింతసిగ్గు పోలదుసుమ్మా!)

(2) నిరాకరణోద్యమము వలనఁగష్టపడు వారలఁగూర్చిసీసము

సీ॥ జిలుఁగుఁజీరలకు సొమ్ములకు దూరముచేసి
వెతలఁబెట్టినటంచు వెలఁదులడల
మా నోటికడి దీయఁ బూనినా డితఁడంచు
నుద్యోగులెల్లను నులుకుచుండ
నిబ్బడిపనివెట్టె నితఁడేమొకోయంచుఁ

బోలీసులేవేళఁబొగులుచుండఁ
బట్టపరీక్ష కుద్వాసనమ్మునుజెప్పి
ననుచువిద్యార్థులు వనటనొంద
తే॥ గీ॥ వృత్తులనునిల్పుకొందుమో విడిచియువల
వైతుమో యంచుఁ బ్లీడర్లు బాధఁజెంద
గాంధిముని గూర్చె నీనిరాకరణ యోగ
మందఱుస్వరాజ్యమునుబొంది యలరుటకును.

7. బొంబాయి యల్లరికి గాంధిగారి మనస్సువర్ణనము,

ఉ॥ కత్తులరొమ్ములోఁ జొనుపుకైవడి హాలాహలంబు కడ్పులో
నెత్తుచుపోయుమాడ్కి వచియింపఁగఁ దీరనిబాధనొందెనా
మెత్తనిగాంధిచిత్తము ప్రమేయమెఱుంగని బొంబయిప్రజల్
తత్తరమొంది చేసిన వ్యథాయుతమైతగు నల్లరిన్ గనన్.

8. పాండవులకు ద్రౌపదికిని గల వావివరుసలు కందము.

క॥ పతులైదుగురగుదురు యమ
సుతుఁడు మఱఁదిగాఁడు మాద్రిసుతులందుఁ గని
ష్ఠతనయుఁడు బావగాఁడా
పతులుకడమవా రగుదురు బావలు మఱఁదుల్.

10. సమస్య:

క॥ అక్కా! చైద్యునకిడునట
చక్కనినిను రుక్మి! యిదియు జగమునఁగలదే

చొక్కపుముత్యంబులు వెతి
(కుక్క కుందలం బ్రాలువోయ, కుతుకంబెసగన్.)

11. చోరుండు, కవి వర్ణనము. మత్తేభము.

మ॥ పదముల్ మెల్లనఁ జేర్చి శబ్దమునయిన్ భావంబు సంధించు చున్ । గదియన్ జిత్రతరార్థజాతమునలంకారమ్ములన్ గొంచు న। మ్మ్మదమూరంగ రసాంతరస్థితిదగన్ బొందించిదో పైకద్య। క్పదమున్ బూనెడు సత్కవీంద్రుఁడలరున్ బాటింపఁ జోరున్ బలెన్.

12. అధికమాసములు—గీతము

తే।గీ॥ వడ్డిలెక్కించుచో గర్భవతుల నెలలు
గణుతిసేయుచో నుపయోగకరములగును
గడమ వేళలయందు మేకమెడచన్న
లధికమాసంబు లెంతయు నరసిచూడ.

13. సమస్య

క॥ వినుమేడు లేని యూరున
కునుజంఘులు పదియుఁ బదునొకొండు కుచంబుల్
కనుఁబొమలుతొమ్మిదైతగుఁ
(గనులునుబంద్రెండు మఱియుఁగానయిపద్యోన్)



To

Mr. D. Rajasekhara Sathavadhani,
Proddutur.

My dear Mr. Rajasekharam,

Allow me to pay my sincere tribute to the authoritatively acknowledged talents of yours, as one of your most faithful friends. Your hearty and generous admiration for the merits of others, your pleasant and lively talk, your polished and unassuming manners, your undaunted patriotic spirit, your sweet and encouraging smiles, your unblemished character, your great encyclopedic proficiency, your conversation resplendent with singular wit and fiery eloquence, your simple and praiseworthy ways of life, your epigrammatical and extempore poetic strain and above all, your ever obliging disposition, all these have obtained ready access to the best and most enviable company for you.

My dear friend,

I can never forget that most trying occasion when you electrified the minds of even the most fastidious critics who stooped to scurrility; yet no provocation and no example could disturb the majestic peace of your cultured mind. You never seemed for an instant discouraged and on the other hand, your Sathavadhanam was becoming more and more interesting gradually. The more severe and critical became the test, the more brilliant and purified came you out of the ordeal fire of it. You

were then in your own peculiar fashion jauntly swinging your legs; fingers were playing with the beautiful moustaches; smiles were brightening up the cheerful countenance; and the spontaneity of your meridian poetic flow was predominating its potent sway over the hearts of the great audience. In a word, you kept the audience spell bound. You acquired such on influence over them that they would have even gladly laid down their lives at your feet if you had only just asked them to do so. You cut a big figure in the fight which was at its fiercest; Perfect silence reigned there; your critics' lips were sealed; and what was most audible to all was your melllifluent voice which could have turned all of us into slaves if only we had been a little more literate people than we really are. Fortunately for your critics and unfortunately for you, you possess a big head in a small body. In my humble opinion, one, with the brains of such an intellectual giant as yourself can as easily plunge into the deep waters of the great Arctic Ocean and fathom its depth and can soar on high and measure the height of the firmament as if it were with no effort. You possess the keen imagination on the transparent surface of which the whole material world is clearly reflected. I have never seen you resorting under even the most provocating circumstances to any melee except to a calm and dignified leterary encounter on the most substantial lines. And you

always carry the day over your formidable opponents. So, it is no wonder that by the grace of Muse, congratulations and compliments always rain in around you from the most disinterested quarters. It is as clear as a crystal that you are one of the best poets that our Andhra Desa ever furnished; and none can gainsay this humble compliment of mine. Except Chellapilla Venkateswara Sathavadhanee, all your co temporary Sathavadhanees are not fit to hold the candle to you. You have always had a lion's share amongst the literary circles. I am inclined to think that it is not easy for anyone to pattern after you. Unlike many a poet you neither parade your own doings nor look daggers. There are only a few people who hate bunkum as heartily as yourself. Your kind advice to some people who had hitherto been burning daylight are just beginning to realize their responsible positions.

× × × ×

Professor Herbert Spencer who is the greatest living authority says:—"Poetry itself is the life of nature."

"The Queen of Nature lives on the ambrosia of the extempore spontaniety of the Poetry."

[Rosa Elizabeth]

"The poet never manufactures words themselves but builds the Universal Temple of nature."

(Lord Salisbury.)

"The poet uses words indeed; but they are the instruments of his art. Any body can use the word but he has no image of the thing; and the business of poetry is with images and not with words. The poet's words are the materials which they are to dispose in such a manner as to present the picture to the mental eye and if they are not so disposed they are no more entitled to be called poetry than a bale of canvas and a box of colours to be called a painting. Logicians may reason about abstractions. But the great mass of mankind can never feel an interest in these. They must have images. The strong tendency of the multitude in all ages and nations to idolatry can be explained on no other principle. The first inhabitants of Greece, there is no reason to believe, worshipped one invisible deity. But the necessity of having something more definite to adore, produced, in a few centuries, the innumerable train of Gods and Goddesses. But for poetry God could never have attracted so many worshippers. Devotees turn away in disgust from words other than those of poetry which present no image of God to their minds. It was before Deity was embodied in human form, walking among men, partaking of their infirmities, leaning on their bosoms, weeping over their graves, slumbering in the manger, bleeding on the Cross, that infidels had held their most potent sway over the world."

(Macaulay)

"The worst poet is ten thousand times better than the best author of a dictionary produced in any language."

(Carlyle)

"The poet eats ambrosia and drinks nectar."

(Ramananda Chatarjee)

"Death is a beautiful damsel of eighteen summers to him." (Rabindra)

"The poet has his own enviable smiles and tears.'

(Sarojini Devi)

"The poet enjoys the beauties of Nature even in the womb of a tigress if there remains still a breath in his nostrils."

(Sir Sheridan)

"Before his mind's eye the whole paradise is shut up in gaol within its rusted iron-bars."

(Tolstoy)

My dear Mr. Rajasekharam.

Whenever I think of you I think of the best poets who, I fancy, are standing before my mind's eye with the best quotations lucidly written on their wrinkly foreheads.

× × × ×

I know my tribute would be most incomplete if I fail to speak a word or two about your inseparable colleague and bosom friend Mr. G. Venkata Sesha Sastri who is your right arm. He is an

energetic young man of excellent physique and he always preserves a composed calm and natural look unruffled by passion, joy or laughter. Bewitchingly beautiful he looks during his performances. He gives his finishing touch to images of your happy imagination. His brains seem to conmand a splendid view of the immortal piper to whose tunes all the celestials dance on the highest pinnacle of the natures Temple. Like a roaring cataract his spontaneous poetic flow falls upon the bulk of the audience.

In fine tendering my apology to any accomplished critic who may accuse me of having not written the tribute at the full length your attainments deserve and wishing you every success in all happy walks of life,

I remain,<br>
Your's sincerely.<br>
A. K. MUNI.

Proddutur.<br>
24-11-1921.



31-5-1922తేది రామేశ్వరమున ఆర్. కృష్ణమూర్తిరావు గారియింటజరిగిన యవధానము:

---

మ॥ దివిషత్సంఘ సుదుర్లభంబయిన మద్దివ్యత్కృపాలోక వై<br>
భవముప్పారఁగ బ్రహ్మవిద్యను గడింపఁబోక యెల్లప్పుడ<br>
ష్టవధానంబు శతావధానమనుచుం జన్మంబు వెచ్చింతువం<br>
దువా యేమో యెదియైననీకళయొ గాదో తల్లి రామేశ్వరీ!

మ॥ సుకవోాకష్టమొ తేలికోబగువా హెచ్చోలొాచ్చోయేమై నమా। మకచిత్రంబు శతావధానము రచింపఁగోరెఁ గొన్నాళ్ళు, కో। రికలఁదీర్పఁగఁ గల్పవల్లివగు నీపేర్మింబు శ్రీరామర। క్షకదా మూకిఁకలోపమించుకయుఁ గల్గఁబోదు కామేశ్వరీ!

రాజశేఖరం

మ॥ వరతేజస్కులు కాళిదాసుఁడును దుర్వాసోమునీంద్రుండు శం। కరుఁడయ్యాది జగద్గురూత్తముఁడు నీకారుణ్యముఁ గోరి కొ। ల్చిరనంగా నిఁకమాదృశుల్ గొలువఁగాఁ జిత్రంబె నిన్గొల్వని। ద్ధరఁ గీర్తిప్రతిభారతుల్ గలుగఁ జిత్రంబా న కామేశ్వరీ!॥

వెంకటశేషశాస్త్రి.

అవధానము.

1. దాక్షిణాత్యులపర్యటన విశేషము.

మ॥ "ఎవరెస్టెత్తదియెం"త నంగ "నిరువైయేడ్వేలమూడష్ట" లన్నవెనఁ "దప్పదిమూరతక్కువనఁగా" నాలెక్కతప్పెట్లు"నాఁ। బ్రవచించెఁ మణియయ్య "రిడ్డెనలపాత్రఁ బెట్టితిఁ దానిమీా। వవిసర్జింప"రటంచు, నోరుబ్రిగడీర్ బ్రూన్ మూాసె సాశ్చర్యుఁడై.

2. సమస్య,

ఘనతనుపరిరంభే గండరేఖావలంబే

కుచయుగళవినోదే కుంతలశ్రీప్రసాధే
నిచుళ వసనసీవీ మోక్షణే శ్రీరతౌ యా
(చతురధికకరాశా శార్ఙ్గినోనఃపునాతు.)

3. సమస్య.

క॥ ఎల్లజగంబుల నిజచరి
తోల్లసనముచేఁ గఱంచి యురుగుణుఁబతిని
త్యోల్లాసిఁ జేయు సతుల మ
(తల్లికి మగఁడొకకన్న ధన్యత గలదే?.)

4. సభావర్ణనము.

చ॥ శ్రమమనకించుకేనియునుఁ జయ్యనవచ్చి కృపారసంబునే
త్రములహృదంతరంబులను దాండవమాడఁగ మేము సెప్పు ప
ద్యములనువించుమాయశము దద్దయు హెచ్చుగఁ జేయఁగోరుధీ
సుమహితులౌ సభాసదుల సూటిగ మెచ్చగ వచ్చునే కదా?

5. సమస్య.

క॥ బాధకుఁడగు మారీచుని
సాధించిశరాళి ననుజసహితుండై వే
గాధికత రాముఁ డాదిమ
(మాధవుఁడిలుసారఁగ సీత మాయంబయ్యెన్.)

6. క॥ శ్రీరామహృదయమును సీ
తారామామణియు పవనతనయునకు ముదం
బారఁగఁ దారకమంత్రము
దారంబుగ బోధసేసి ధన్యునిఁ జేసెన్.

తే॥ అతులసౌభాగ్య భోగభాగ్యముల నొసఁగి
యాయురారోగ్యములను సౌఖ్యములఁగూర్చి
పుత్రపౌత్రాదికముల సమ్మోదమునిచ్చి
యానధూవరులను దేవుఁ డేలుఁగాత.

8. సమస్య.

తే। గీ॥ అతికృపాపాంగ! వరమృదులాంతరంగ!
భసిత నవళాంగ! కరలస ద్వరకురంగ!
యచలజాతానుషంగ! దుర్వార్తిదైత్య
(రాజమదభంగ! శ్రీముక్తి రామలింగ!.)

9. సమస్య.

క॥ అంగములు నవయఁగాఁ దప
ముంగావించితిని గరుణ పొడమదు నీకో
యంగజహర గౌరీ సా
(రంగాక్షికి నైనఁదెలుప రాదె మహేశా!.)

10. అవధానమునకుఁ గూర్చుండునపుడు మామనన్నుల వర్ణ
నము చంపకమాల.

చ॥ నృపకుల దీపకుండగు కిరీటికి సంగర కాంక్ష యెట్టి ద
ట్టిపగిదిగా వధానము ఘటిల్లుట యెప్డు సభాస్థలంబు మే
మెపుడునలంకరించి బుధులింపువహింపఁ గవిత్వమల్లఁగా
నెపుడెపుడంచుమామనసు లెంతయునుత్సుకతన్ వహించెడున్

11. అనుమానముగల ముదుసలిమగఁడు భార్యతో నెట్లు కాపురముచేయునో. సీసము.

సీ॥ తనయింట నెంతతీరనిచుట్ట మున్నను
వెలఁదిఁబాయక వెంటవెంటనడచుఁ
బనవుకఁ౦కుమ మంచి వస్త్రముల్ దాల్చిన
మెఱుఁగులాయని నెత్తిమీఁదఁబొడుచుఁ
బొరుగింటిచెలి పనిఁబూని మాటాడినఁ
బెనుశంకచే నాల్కపీకికొనును
ఒకవేళఁదలవాకిటికి నొకించుక రాఁగ
నెవనికోసమటంచు నీసడించుఁ
తే॥ గీ॥ జెంబుగొనిపోవఁబైకాపు చెలినిఁబంపు
నమ్మగారింటికైనను నంపఁ వెఱచుఁ
గులుకుఁజెళుకులచెలి గట్టుకొనిన వృద్ధ
భర్త జీవిత మది విషప్రాయ మవని.

÷ + × ×

14. తే॥ గీ॥ ఇనుమునూదంటుజాతికై యొగయునట్లు
తేటి కమలంబు మీఁదికి దాఁటు నట్లు
కమలముఖభర్త ప్రథమ సంగమము వేళఁ
జేరి ముద మొందమదిని గాంక్షించుచుండు.

♦ ♦ ♦

అవధానాంతమునఁ గవులు చదివినపద్యములు

శా॥ అయ్యా మీకవనంబుగాంచి మదినేనానందముంబొం
దితిఁ। వెయ్యేలానిజమెంచిచూడ నితరుల్ విద్వాంసులీ

తీఁగా! దియ్యం బైతనరార నాశువున రక్తిఁ బద్యముల్ చె
ప్పఁగా! నెయ్యొ రెవ్వరిని సరిపోలఁ జాలరని యూహింతుఁ మ
తిఁ జాటుదుఁ॥

క॥ మీవాగ్విజృంభణమ్మును
మీవిలసచ్చతురరచన మీమృదుపాకం
బేవారికి నాశువునఁ
భావింపఁగఁ గలుగదయ్య? పండితులారా!

క॥ శ్రీకామేశ్వరిసత్కృపఁ
జేకొని తీపిగను గృతులఁ జెప్పెదు మీతో
డీకొనెడు మొండివాదపుఁ
గాకవు లరగడియ నిల్వఁగాఁ జాలుదురే?

కొడవలూరు రామచంద్రరాట్కవి.
31-5-1922



శా॥ ఆరామేశ్వర పట్టణాంతర వివాహాగార మధ్యంబునన్
సారజ్ఞుల్ తగఁగూడియుండెడు సభాస్థానంబునం దద్భుత
శ్రీరాజిల్ల శతావధానము రచించెన్ గోవిదుల్ మెచ్చ స
ద్ధారా శుద్ధిని రాజశేఖర కవీంద్ర శ్రేష్ఠుఁ డీవేళలో

చ॥ సలలితమైన భావములు చక్కనిమెత్తని శైలి మార్దనం
బలరెడుమంచిపాకమును హాయినిగూర్చి రహించుఘాటి మం

గళగళరావసంపదలు గల్గిన మీకవితాసుహస్త్వవైఖరీ
నలువకునైన శక్యమగునా నుతియింపఁగ రాజశేఖరా!

కః నీవును నీతమ్ముఁడు గాం
డీవియు భీముండునట్లు నిలిచినచో దు
ర్భావులు కాకవికౌరవు
లేవిధమున విఱుగువారొ యోఱుఁగుజగంబుల్.

అధ్యక్షుం వెంకటనారాయణప్ప.

మః అవధానంబొనరించి యింపెఱుకునాయారీతులన్ సంతసం
బవలీలన్ బొనరించుచున్ సుకవిరాణ్మాధ్యన్ బ్రశస్తంబునై
తవుకీర్తిన్ గయికొంటి గెల్లురును మోదంబొంది రిప్పట్ల నో
కవిరాడ్వాంద్యులుమీకుఁబద్యముబహూకారంబుగానిచ్చితిన్

టి. వి. శాస్త్రి.



6-9-1922 తేది గుత్తినగరమునజరిగిన యవధానక్రమము.



మః బలధారేయము నీకృపాలవము మాపైనుండగా నేపురం
బులకున్ బోయిన నెట్టిపండితసభాపూజ్యస్థలిన్ నిల్చినన్
గలదేలోటది యెట్లొసద్విజయమొందన్ జేసిభారమ్ము మ
మ్ములనున్ జెందఁగనీక ప్రోవఁగలవెప్డున్ నీవు కామేశ్వరీ!

శా॥ కన్నుల్ దేవియలోల్కు-శబ్దము లొసంగన్ నేర్చునవ్వాణి భా। గ్యమ్మాయిందిరయీయ నేర్చుc దమభక్త శ్రేణికిన్, భాగ్యపూ। రమ్ముగ్ విద్యయు భుక్తిముక్తియును సర్వంబిచ్చి లోపంబు లే। కమ్ముల్ గూర్చక నీదుభక్తులను రక్షిల్ సేతు కామేశ్వరీ!

మ॥ గురువిద్వాంసులు గూడియుండుసభలోc గూర్చుండ నా లోనె మా। కెటుcగన్ రాకయు దెప్తా లోనిలుతుగానీ, ధైర్య ముపొంగి భా। స్వరసారస్వతరీతిc బద్యములు పైపైదో పcగా జేతు నీ। కరుణోత్సాహములిట్టివంచుc బలుకంగా లే ము కామేశ్వరీ!.

రాజశేఖరం.

మ॥ అణువాద్యంబుగ మేరువంతముగ బ్రహ్మాండంబు వ్యాపించి కా। రణసత్కారణమై జగద్వలయ సామ్రాజ్యంబు నన్నన్నరో। మణి సింహాసనమెక్కి యేలుజగదంబా! శంభురాణీ! దయా। గుణమూర్తీ! దయ సేయవమ్మ యిటమాకున్ దోడుగా శాంకరీ!.

వెంకటశేషశాస్త్రి.

అవధానము.

1. సమస్య. శుద్ధాంతగాపి వనితాపరసంగతాపి
నాంక్షేదిరాదుపగతేపి మనోహరేపి

ధర్మచ్యుతేశ్చకితధీ ర్దివసే విముక్త
(చంద్రోదయే విరహిణీరమణంముమోచ.)

2. సమస్య:-

ఉ॥ లేమయొకర్తు తప్రియుని లీలను మోసముసేయు దట్టమై
యేమియుఁదోఁపనీనిహి దరింటనుదాగెఁ జలింపకుండఁ, ద
త్స్వామియొఉంగఁడయ్యెఁ, జనుబంతులుకాకము గూడ
టంచునా। (భామకుచంబులందు నొకబంగరుకోయిలపెట్టె
గ్రుడులన్.)

3. సమస్య:- ధర్మవ్రతౌ ధర్మవినాశహేతూ
లోకప్రియా లోకభయంకరౌచ
స్వీయప్రవృత్తైరుభయావభూతాం
(కుంతీసుతౌ రావణ కుంభకర్ణౌ)

4. రాట్నము, మహాస్రగ్ధర, దహ్రసము.
చూడన్ జూడన్ విపంచిన్ సొబగునఁగదులొచ్చన్ బొన
ర్పంగఁబాడున్। వీడున్ సూత్రంబు నెంతేవిరివిగవలువల్
ప్రీతినందిచ్చుదానన్। గూడున్ద్రవ్యంబులెల్లన్ గుదురు
గ మనకున్ గోడునొందున్ బరుండున్। వాడన్ వాడన్ వె
లుంగన్ వలయును స్థిరమా భంగి రాట్నంబులెల్లన్.

5. సమస్య:- ప్రియతరం భవనం ప్రియమండనం
లలితమూర్తి రుదారమతిః పతిః
నవసమాగమసౌఖ్యముపాగతా
(తదపిసా సుదతీ రుదతీకుతః.)

6. సమస్య.

క॥ రబ్బొదలుగలిగెఁగేనుఁ
దబ్బిలగయి లంచమందు, దానఁగలెక్టర్
సాబ్బిగులఁగినిసిరాఁగని
(సబ్మాజస్ట్రేటుమొగము చల్లఁగనయ్యెన్.)

7. సమస్య.

చ॥ పలువురుగూడి వల్గతులఁబట్టి శతఘ్నులఁబోలునట్టి ప్ర
శ్నలఁబయిఁగ్రుమ్మరింపఁదమచాతురినంతయుఁజూపిభావనా
బలమురహింపఁబద్యములఁబల్కుచునయ్యవధానముఁగారసం
బొలయరచించునట్టి (కవి కూరట లోకముమెచ్చుటేకదా?]

8. G-a-n-d-h-i పాదముల మొదటవచ్చునట్లు సీసము. గాంధి గారి వర్ణనము.

సీ॥ జితవైరిశక్తియై చెలఁగునెవ్వనియాజ్ఞ
యాబాలగోపాల మనుసరింత్రు
ఎవనిమాటవయి హైందవులెల్లఁజెరఁజొత్తు
రాంగ్లుడున్నపడకిండ్ల కరుగునట్లు
ఎంచనెవ్వనిమాట కేకకోటిగ ద్రవ్య
మొదిగిపాదములకై యెదురునడచె
డిండీర వరచంద్రమండలోజ్జ్వలకీర్తి
యై యేఘనుఁడు నుతులందఁగలిగె
తే॥ గీ॥ హెచ్చని జగంబదెవ్వని నెపుడుమెచ్చు

నై దుపది సేయు నెవఁడు దేవాది దేవుఁ
డట్టి యతిలోకమాన్యుఁడై యలరుఘనుఁడు
గాంధికి నొనర్తు నే నమస్కారశతము.

9. "కళాస్త్రమేసుకోని కంబడి కప్పుకోని పండ్లిగిలిస్తె బయ
మానా" ఈభావముఁ బ్రకటించి చంపకమాల

చ॥ పులియొకఁడేగు దేరఁగని బోయఁడొకం డొకవేసమూనఁ
గా॥ బులిచిఱునవ్వుతో ననుఁ "బ్రబుద్ధుఁడవీవు కళాస
మూని కం॥ జళిపయిఁగప్పి యూరకయె పండ్లిగిలింప నె
లుంగుఁబంటి వం॥ చలుకుదునే? వృథాశ్రమమునందితివ
య్యయొ గొల్లబోయఁడా"

10. పృచ్ఛకుఁడిచ్చిన కల్పననను సరించి కందము.

క॥ కులముచెడె, సుఖము దప్పెను
బొలుపుగ నుట్టికిని స్వర్గమున కెడమైతిఁ
ఖలసహవాసము తప్పని
తలపోయుచు బ్రాహ్మణుండు తనుఁదిట్టికొనెన్.

11. సమస్య. లలితలలితకాంతిశ్చంద్రమా దుష్కళంకః
మృదులమరుణమబ్జం దూషితం శైవలేన
అమలవిశదతేజ శ్ఛాయయా సన్నిబద్ధం
(కిమపిసకలహృద్యం కల్పయే న్నైవదైవం.)

12. గుత్తిలో నీళ్లకష్టమును గుఱించి వరుణప్రార్థనము గీతము.

తే॥ గీ॥ నిండెఁగష్టంబు నీకు కన్నీ రెయమ్యె

వెన్నవంటి లతాంగులు వెతలుపడిరి
గుత్తి మాసోదరులఁ గడుఁ గూర్మిఁజూచి
వరుణ! వర్షంబునొసఁగి కాపాడవయ్య!.

13. యచ్ఛబ్దము విభక్తులన్నియువచ్చునట్లు భగవత్ప్రార్థనము

శ్లో॥ యస్సత్యాకృతిరున్నతోన్నతపసం వేదాగ్రణం తేచయం
యేనవ్యాప్తమిదంజగన్నియమితంయస్మైఫలంకర్మణాం
యస్మాజ్జంతుజనిర్నప్రతిశ్చ విభుతా యస్యోర్జితాసర్వతః
యస్మిన్ ధామని లీయతే తతమిదం తస్మైనమస్తేజసే.

14. సభ్యుఁడిచ్చిన కల్పన.

చ॥ చలిబిగిగుబ్బలెద్దులుగఁ జేసియు, నారనుమోకుగట్టుచున్
వలయుపునాభినిన్ గవిలె బావిగఁజేసి మనోజుఁడన్ కృషీ
వలుఁడును గోడెకాంత్ర పలుస్వాంతములన్ బొలమందు
మోహామన్। జలమును బల్లునోయనఁగఁ జానరహించె మ
నోజ్ఞవేషమై.

19. శ్లో॥ నాభింకూపమురోభవాతువృష భారజ్జుంచరోమావళీం
కృత్వామారకృషీవలోయువమనః కేదారమాప్లావయన్
సమ్యజ్యోన్నహజలై స్తదాత్తవిభవై స్తస్యైర్జనాన్ ప్రీణయన్
శోకేచాప్రతిమోన్నతిర్విజయతే హేలాభువ స్సుభ్రువః.

16. సమస్య. ✓

మ॥ ప్రథిమంబొప్పెడు ప్రమాకుమంచమున దీర్ఘంబైనమేన్నెవ్వ
చిము! కుక్క థమాన్నాదమఃలీసనిద్రగను నాకుంభశ్రవుం

డంత మ॥ త్త్రఘలీ క్రాంతిని ముక్కులోనరిగి యంతర్భాగ
ముఁ గుట్టఁగా। (దృఢసత్త్వంబునఁ జీమ తుమ్మెగదరా దిగ్దం
తులల్లాడఁగన్).

17. కేశవపిళ్ళగారిని "కీర్త్యాద్రి" తోఁ బోల్చి మత్తేభము.

మ॥ చెఱలో శోషిలువారికన్నమిడఁగాఁ జేయించె, ఫారెస్టునన్
బరఁగన్ జెల్లిన సర్వకష్టముల మాన్పన్ గంకణంబూనె, సా
దరుఁడై బీదలఁ బ్రోచువట్టుననుసత్సాహమ్మునన్ బెద్ద, ధై
ర్యరతుండీతఁడు హైందవంబునకుఁ గీర్త్యాద్రియన్ న్యాయ్యమా

18. వారి బిరుదమువచ్చినట్లు పైదాని నత్యాశుధారలోఁ జె
ప్పమన్నందులకు.

తే॥ గీ॥ వితరణ గలారు కేశవ పిళ్లగారు
సారతరమౌ దివాన్ బహదూరుగార
లానర సత్యధర్మంబులనుపమ సేయ
వఱలఁగలవారు కీర్త్యాద్రివంటివారు.

19. సమస్య.

మ॥ మతినూహింపఁగఁ గర్ణపర్వము గుచున్ మాటల్ ప్రకాశిం
పఁగాఁ। బతిసేవాదిగుణంబువట్టున సభాపర్వంబు నైయొప్ప
శా। శ్వతసౌశీల్యపుగౌరవంబునను స్త్రీపర్వంబు నైమించభా
(రతముల్ బోలెవధూవతంసము జగత్ప్రఖ్యాతమై రాజిలెన్.)

20. సమస్య.

క॥ వాస్తైపెల్లించ్చెంటాదపడి

సీష్ట్రినులకుఁ బనులుమిగులనిచ్చిరి, నాకుఁ
లాస్ట్రింకే చాలులన
(ద్రిష్టి)క్లొక్కటిగ దారలు దీర్చెడు వేళఁ.

21. సమస్య. ―

క॥ విశ్వామిత్రయులర దశరథ
రాడ్రిత్నము మఖముచేసె వ్రితఫలముగ స
ప్రమాద్రీతిని జిరకాలపు
(గొడ్రాలికిఁ గొడుకొకండు గొబ్బునఁ గలిగెఁ.)

22. నాట, నాటకురంజి, సురటి, కల్యాణి, రాగములు పాదా
దిని వచ్చునట్లు పరశురాముని వర్ణనము సీసపద్యము.

సీ॥ నాఁటఁగల్గిన భూమినాథులఁ బెక్కుర
నిరువదియొకమారు ధరణిఁగూల్చె
నాటకు రంజితఖేటకు శ్రీరాము
నెదిరించి యీసున నేపుసూపె
సురటివైచినయట్టి సొబగున విప్రుల
కానందమొదఁగూర్చి యలరఁజేసెఁ
గల్యాణి రేణుకాకనకాంగిఁ దల్లిని
గురునాజ్ఞఁ దలఁదాల్చి గొంతుగోసెఁ
తే॥ గీ॥ ప్రకటజమదగ్ని వంశ వారాశి పూర్ణ
సోముఁడై యొప్పెడి పరశురామ దేవు

నఖిలగుణములు వర్ణింప నలవియగునె
నలువకును వేయినాల్కల చిలువకైన.

23. సమస్య.

క॥ ఏస్ఖలనమెఱుంగని సుమ
నస్ఖమణి యతీంద్రుఁడైన నారదుఁడును శా
పస్ఖలిత పుంస్త్వుఁడైనఁ ద
(దస్ఖలిత బ్రహ్మచారి కఱువది కొడుకుల్.)

24. పృచ్ఛకుఁడిచ్చిన ప్రశ్నపైఁ జెప్పినది.

తే॥ గీ॥ చెఱువులో నేదియుండినఁ, జేరెడంత
యేని నీరంబు నుండఁగా నీయ దట్లె
"జోబి" నింకేది యుండంగఁ జోటొసఁగదు
"బొక్క" యద్దాని నదననఁ బూన్పకున్న.

25. మీనములు - సీసపద్యము.

సీ॥ వీరరసము విజృంభింపఁగా దేనిని
గేల దువ్వంగ నా భీలతఁ దగు
నతిమనోహరమైన యాననాబ్జమునకు
భ్రమరము లెయ్యది ప్రభలుగూర్చు
ముద్దాడఁగా మూఁతి మూఁతిరొద్దకుఁబోవ
బాలురెయ్యదిగాంచి భయముగాంతు
చలికాలమందు వెచ్చఁదనముగల్గించి
పెదవుల నెయ్యది ప్రీతిఁగాచుఁ

తే॥ గీ॥ చంద్రికి చల్లఁగ నుండెడు దాఁక దేని
కించుకయు లోటులేకుండ నెసఁగుచుండు
నాంధ్ర ముద్దాడ నే యది యడ్డు వచ్చు
నట్టి మీాసముఁగూర్చి యేమందుమయ్య!

26 'కలువలు నిద్రనొందె' 'తమ్ములఁ దుమ్మెదలాడుచుండె'
'జక్కవలాన వెన్నెలల్' యీవాక్యములు వచ్చునటు వె
న్నెలరాత్రివర్ణనము ఉత్పలమాల.

ఉ॥ క్రమ్మరతిశ్రమన్ జెలుల కన్గవ కల్వలు నిద్రనొందె, నం
దమ్ముగుముంగురుల్ మొగముఁ దమ్ములఁదుమ్మెదలాడుచుం
డె నాఁ। గ్రమ్మె, జిలుంగుఁబైటదొలఁగన్ జనుజక్కవలాన
వెన్నెలల్। సమ్మదమందెలోకము కళానిధివెల్గెడు రాత్రి
వేళలన్.

27. ఇంచుక యాలస్యముగా ననంతరావుగారొసంగినది.
సమస్య.

శా॥ సంధుల్ దీర్చి ఖగోళసంగతులచర్చల్ మాన్యపులోఁ జూపు
చున్। గ్రంథంబుల్ దగఁజెప్పి బాలుర కహఃకాలమ్ము నన్
సర్వసం। బంధంబుల్ విడి నిద్రవోయెనిశి, నాపైస్వప్న
మున్ జెంది ని। (ద్రాంధుండంధతమంబునన్ గనియె నయ్య
ర్కేందుబింబంబులన్).

బహూకృతి.

అప్పు డనంతపురం జిల్లాబోర్డు ప్రెసిడెంటును, మద

రాను శాసనసభోపాధ్యక్షులును, దివాన్ బహదూర్ కె. సి. ఐ. ఇ. బిరుదాంచితులును, నవధాన సభాగ్రాసనాధిపతులును న గు పి. కేశవపిళ్లగారు రుపన్యసించి స్వర్ణకంకణములు సమర్పించిరి.

## కృతజ్ఞతాప్రకటనము.

ఉ॥ ఇ త్తఱిమీరొసంగిన యహీనబహూకృతి చూడఁగా భవ
చ్చిత్తమృదుత్వముల్ దెలుపుఁ, జేకొని సంతసమందువార
మో! గుత్తిపురంబునన్ గలుగు కోవిదులార! మనంబునిం
డ నిరా! కీర్తిము సంగ్రహింపఁగదరే మరుదార కృతజ్ఞతా
రతుల్.

సీ॥ ఇనుమునుగూర్చి నూరేసిపద్యంబుల
నల్లఁడీయంచని యడుగువార
లాంధ్రసంస్కృతముల నల్లించి లాటినో
పార్శియో వలెనంచుఁ బలుకువారు
హాల్లు హై దారింటి నతికించి దుష్కర
ప్రాసమ్ములకు నాసపడెడువారు
రసవంతమైన వర్ణనలీక కోడినో
కుక్కనో వర్ణింపఁగోరువారు
తే॥ గీ॥ గాక, కవితారసజ్ఞులై కరము మంచి
ప్రశ్నలిచ్చి మాబుద్ధి వైభవమెఱింగి
యుభయులకుమోదమిడి కాన్కలొసఁగి కీర్తి
వఱలఁ జేసితి రోగుత్తి పౌరులార!

మ॥ తనయొద్దన్ బనిచేయుచున్నపుడు నన్ దమ్ముండన్ బలెన్ బ్రే
మమై! గనియెన్ మేమవధానపాళి సలుపంగాం జేసి సత్కీర్తి
ని! చ్చెను దాక్షిణ్యసముద్రుండిట్టి ఘనుండీక్షింపంగలేండెందు
నే! ననయంబున్ స్మరియింతునియ్యనఘు మా యన్ యన్
నృసింహప్రభున్.

ఉ॥ ఉత్తమగుత్తి దుర్గకథ లుల్లమెలర్ప నెఱుంగనయ్యె! లో
కోత్తరబుద్ధులై యిచటనుండు బుధేంద్రులమైత్రిగల్గె; స్వ
ర్ణోత్తమకంకణద్వయము నూనంగనయ్యె; గడున్ రహించె
గోత్రం! గోత్రయశంబు నీవలన గుత్తిపురంబు శతావధా
నమా!.

తే॥ గీ॥ కొలువుల సభాస్థలంబుల గుత్తినగర
ఘనవిబుధదత్త సింహాకంకణ విరాజ
మానకవిసింహయుగమంచు మమ్ముంబిలువ
మది ముదము గల్గుం గావుత మాకు మీకు.

మ॥ వరమిత్రుల్ దరిం జేరి సౌఖ్యమున సంభాషించునప్డున్ మతే
పురమందైన వధానముల్ సలుపునప్డున్ బంధులుల్లాసముల్
మెఱయన్ బల్కెడునప్డు గుత్తిపురమున్ మీ మేటిసన్మాన
మున్ । మఱువన్ బోవము గుత్తియన్ పలుకె యానందప్ర
దంబయ్యెడున్ ।

మ॥ జననీ! మేమును దొడ్డవారమని హస్తంబందునన్ గంకణం
బును వీరుంచిరి మాప్రభారతి లవంబున్ లేదయేనాండు మా

తినునన్నంబును గట్టుపుట్టమును నీ దేయౌను మే మొందు మ
న్ననలుఁ నీవెయగుఁ గ్రహింపుము యవజ్ఞాదేవి కామేశ్వరీ!

రాజ శేఖరం.

మ॥ అతిలోక ప్రతిభా ప్రభావ నికురుంబా నీమహత్త్వంబు గా
కతిసూక్ష్మంబులు మామనంబు లిఁక విద్యావ్యాప్తియం
తంతె యు। న్నత విద్వత్సభలోన గెల్పుగొనుటన్నఁ శక్య
మే? తత్సభా। గత విద్వద్వరదత్త పంకితబహూకారంబు
సామాన్యమే?.

శా॥ ఊరుఁ బేరును లేనివారలకు నేదో పేరు గల్పించి యి
ల్లేరాజ్యంబనువారిఁ బెక్కుసభలోలిఁ ద్రిప్పివిద్వన్నుతి
శ్రీరమ్యంబుగ స్వర్ణకంకణములుఁ నేర్జోడులందిచ్చి నీ
వే రారమ్మని పిల్వ జంకుటలు మా కేలమ్మ కామేశ్వరీ!.

ఉ॥ ముత్ప్రద మాప్తవర్యులకు బుద్ధినసూయవహించువారి కా
పత్ప్రద మల్లె గు త్రిపుర పండిత పౌర సదస్యపాళి కు
దగ్రప్రధమానకీర్తిదము ధన్యవరేణ్య నృసింహనామ వి
ద్వత్ప్రభుదత్తకంకణము దాల్తుము నెమ్మది సంతసిల్లఁగన్.

సీ॥ ఆంధ్రగీర్వాణ మహాసారసారస్వ
తాంబుధి నఖలీల నవఘళించి
యాంగ్లేయసవ్యవిద్యాపరీక్షా సము
త్తరణాత్త పట్టభద్రతఁ జెలంగి

యసమానసరసతా లసమానసుకవితా
నిర్మాణచాతురి నెఱిగడించి
యఖిల లౌకిక పటు వ్యావహారిక మహా
వ్యూహభేదన సమాయుక్తి దనరి
తే। గీ॥ రాజహంసలు పద్మాకరంబుఁ బోలె
నేఁటిసభ యెంతయేని రాణింపఁజేసి
సద్యశము మాకొసంగిన సభ్యులార!
భవ్యగుణులార! మీకిదే వందనములు.

శా॥ మాకుఙ్ సత్సభఁగూర్చిమాకవితకాత్మన్ మోదముఙ్ జెంది తా। మేకీర్తింపుచు స్వర్ణకంకణము నెమ్మిన్ జేతికందిచ్చుచుఙ్। మాకీర్తిఙ్ వెలయించు గుత్తిపురి సన్మాన్యులు సద్యశ। శ్రీకల్యాణ సుఖమ్ములిచ్చి యెపుడుఙ్ జేపట్టు కామేశ్వరీ!.

శా॥ కొండల్ నాలుగు ప్రక్కలఙ్ బలిసి నీకుఙ్ గోటలై యొప్పఁ బూ। జ్యుండౌ గౌతమునాశ్రమంబవగుటఙ్ శోభిల్లు నీకీర్తి శ్రీ। చండీదాస శతావధానుల సభాసన్మానసంపత్తిచే। నిండుఙ్ లోకము లెల్ల గుత్తిపురమా! నీమేలు సామాన్యమా!.

వెంకటశేషశాస్త్రి.

కవులుచదివిన బహుమానపద్యములు.

భోభోస్సభ్యాః అఖండభూమండల మండనాయమాన శ్రీమచ్చెన్నపురీ రాజధానీ మండలాంతర్వర్త్యుదయపురీ వా

స్తువ్యావేతౌ బ్రహ్మశ్రీ విరాజమాన రాజశేఖర వెంకటశేష నామానౌ కవివరౌ పట్టణనగర న్యాయస్థానప్రభువర్య శ్రీమద్రాజమాన్య శ్రీమద్వైష్ణవకులావతంస శ్రీమన్నృసింహాచార్య పరమప్రేమావ్యాజే నేమం గౌతమాశ్రమ మాగత్య దుందుభివత్సరీయ ప్రోష్ఠపద్యాం గీర్వాణపాఠశాలాయాం మిళితమహాజనౌఘమధ్యే తైర్బహుమానపురస్సరం దత్తాసనారూఢౌ సంతౌ సకలవిద్యాభిమాని శ్రీశారదాంబా పరమప్రసాదలబ్ధానవద్యహృద్యకావ్య నాటకాలంకార న్యాయవ్యాకరణ కవితాద్యనేక విద్యావైశారద్య ప్రదర్శనార్థ మత్రత్యైరాదరాదర్థితౌ గీర్వాణాంధ్రభాషాభిజ్ఞ జన కృతసమస్యాపూరణాద్యనేక ప్రశ్నాంబూన్ స్వీయావధానాఖ్య గంగాప్రవాహేణానుపదమేవ ప్రపూర్య పండితపామర హృదయాహ్లాదకౌ సంతౌ రేజతుః. ఏతత్సంఖ్యావద్దర్శితాపూర్వ కవితావధాన సంతుష్టాంతరంగై రస్మత్పౌరవిద్వద్భిరేతత్సమ్మాన కరణధియా దీయమాన సౌవర్ణకంకణరూపప్రాజ్ఞ విత్త మేతచ్ఛక్త్యననుగుణం, శతనిష్కాణా మేకతంతురితి న్యాయమనుసరతిచ. ఏతౌ శుక్రబృహస్పతీ ఇవ నీతివిద్యావిశారదౌ, అశ్వినావి వైకనా మైకమతికౌ బలరామకృష్ణావివ రూపవంతౌ హరిహరావివ సర్వమాన్యౌ.

ఏతావత్పర్యంత మీదృశకవివరౌ నమయాదృష్టశ్రుతచరౌ. భావికాలేప్యేతాదృశౌ సభవేతామితి నశపథం వక్తుముత్సహే. ఆభ్యాంసహ ఘటికాత్రయం సత్ప్రసంగోస్మాకం

నముజన్యమహోస్మద్భాగధేయం. మాదృశైః కృశైరేతద్విద్యా నుయా పైహికవిత్తదానాశక్తే రేతావతోప్యతిశయిత విద్యావంతౌ చిరాయుష్మంతౌ సర్వలోకమాన్యౌ శ్రీపరమేశ్వరీ వరమకృపాపాత్రీభూతౌ వైహికాముష్మికాఖిల సుఖవంతౌ భూయాస్తామిత్యాశీశ్శేవదీయతే ఏతావతైవాభ్యాం సంతోషవ్యమితి ప్రార్థ్యతే.

శ్లో॥ యత్కౌశలా దతిముదం సమవాప్య గుత్తి
పౌరా స్సువర్ణవలయే దదురత్యమోఘౌ
తౌ రాజశేఖర సువెంకటశేషనామ
విద్వద్వరావవతు వెంకటశైలనాథః.

కాలవిలంబధి యోపరమ్యతేచ
మూళ్ళగిరి నాగేశాచార్యః,
గుత్తిపురవాస్తవ్యః.



శ్లో॥ సుకవితా వనితా వరరాజశే
ఖర సువెంకటశేష కవీశ్వరౌ
శతవధానవిధా నవధీయుతౌ
విజయతాం సతతం కవిమండలే.

ఆ॥ వె॥ ప్రొద్దుటూరి నుండి యిద్దరుకవివరుల్
శతవధానముఁగడుఁ జాతురిమెయి
నుద్దిగాఁగఁ జేసి యూహలువెలయంగఁ
బద్దు పలికి తప్పు పలుకకుండ.

చ॥ పలుకులు పూలగుంపులును భావములా యమృతంపుసో
నలుఁ। లలితములౌ నలంకృతు లలంకృతులేయగు రీతు
లెల్లనం। జులతరరీతులౌచుఁ గడుసొంపగు వీరికవిత్వవైఖ
రుల్। నలువకునైననింక ఫణినాథునకైన నుతింపసాధ్యమే

మ॥ అనఘుల్ ప్రాజ్ఞులు వీరలుఁ సలుపు విఖ్యాతశతావధానంబుఁగై
తను బాండిత్యముఁ జూచి గుత్తిబుధబృందంబుల్ కడుఁ మె
చ్చి నూ। తనజాంబూనద కంకణద్వయము నందంబార
నర్పించిరీ। ఘనులన్ మెచ్చుచు రత్నముల్ కడుబహూకా
రంబుగా నిచ్చిరిన్.

శతావధాన మిప్డు చేసి శబ్దజాలనైపుణీ
ప్రతానమిందుఁ జూపిరార్యపాళులెల్ల మెచ్చఁగా
సుతాది భోగభాగ్యకోటి సొంపుమీర వార్ధి స
త్సుతావిభుండొసంగుఁగాక శోభనప్రదాతయై.

లండన్ మిషన్ హైస్కూలు, గుత్తి } ఉప్పరపల్లె రంగాచార్యులు, ఆంధ్రోపాధ్యాయుఁడు.



ఉ॥ శ్రీరమణుండు వాసవవిరించి ముఖామరవందితాంఘ్రిపం
కేరుహుఁ డార్తరక్షకుఁడు కీర్తితకీర్తివిశాలుఁ డబ్ధిగం
భీరుఁడు లోకమోహన పవిత్రచరిత్రుఁడు చేయుఁదా ససా
ధారణ ధారణాబలప్రధానులుగాఁగ శతావధానులన్.



చ॥ సువిమలసత్సభాంబునిధి సూరిధరాధర మధ్యభాగమం
దువివిధ కూర్మిరప్రశ్నతతి దుస్తతరంగగతిన్ దలిర్ప భూ
దివిజులు రాజశేఖర సుధీమణి వెంకటశేష నామ స
త్కవి యవధానపోతమును గట్టునఁ జేర్చిరి ధీబలోన్నతిన్.

చ॥ మృదుమధురోక్తులన్ గలిగియింపులు గూర్పఁగఁజాలునట్టి
విూ। సదమల సత్కవిత్వమున సంతసమందిరి సభ్యులెల్ల
నా। కొదవవినూత్న మోదమున నొప్పుగఁజెప్పితినేను ప
ద్యముల్। బుధులరు వీనిఁగైకొని యపూర్వతరోన్నత మో
దమందుఁడీ.

మ॥ అవధానంబు కవుల్ నుతించునటులొయ్యన్ జేసి దత్తానవీ
కవులందున్ ప్రథమావధానులని పల్కన్ జెల్లియున్నత్పురీ
కవిరత్నంబులచేతఁ గంకణబహూకారంబులన్ గన్న యో
కవులారా! తమపాండితీగరిమ చోక్కన్ జేసె మమ్మెంత
యున్.

చక్రాల నృసింహశాస్త్రి.

మ॥ సరిగానుండెనొ తప్పులుండెనొ యెటో సాగించియే యుం
టిమో। జరపన్ లేదొ బుధేంద్రులార! కడువాత్సల్యంబు
నన్ జూచి యీ। యకుదాపద్యములిచ్చిమెచ్చితిరసూయా
భావముల్ లేక యందఱికున్ మీకు నమస్కరింతుము కృ
తజ్ఞత్వంబుపాటించుచున్.

రాజశేఖరం.

Gooty.
11-9-22.

Kavi Rajasekharam and Kavi Venkatasesha Sastrulu whose performances of satavadhanam, the Gooty public witnessed during the last few days, remind me of the great poets of old that flourished in and beautified the famous Hindu Kingdom of Vizayanagar. The profoundity of their scholarship, the versatility of their versifications, their resourcefulness in successfully and speedily combating the very hard problems of metre set to them by a too critical audience, the high excellence of their poetic imagination and their Phenomenal powers of memory have compelled our unstinted admiration. Blessed indeed are the mothers that gave them suck! To attempt to eulouge their talents would be something like attempting to paint the lily or to refine gold or to add another hue into the glorious rainbow. I can only pray to the supreme ruler of the universe that they may both be spared for a long number of years to come, and blessed with continued health and happiness, so that,, they may be the better enabled to enrich the poetic lore of this land of learning and to reveal the true beauties of the Holiness of the Almighty creator. The Telugu country that gave them birth has good reason to be proud of them. And I deeply value the association with them of my humble self an association sprung by accident and strengthened

by their all conquering poetry, supreme in its diction, rich in its ideas and resplendent with the brilliance of genius. May we meet again and again.

The golden Hasthakankanams ie wristlets presented to them by the Gooty public are by no means an adequate recognition of even a fractional part of their attainments. But they may rest assured that wherever they both go, they carry with them our heartiest good wishes and may we hope that these golden bangles my serve as a humble reminder of our tribute to them. With affectionate and loving regards do I conclude this, my token of their esteem.

Gooty.
11–9–1922

N. S. Narasimhachari.
Dist. Munsiff.
President Munro club.

ప్రొద్దుటూర్పుర వాసులును, విఖ్యాత శతావధానులును, నగు బ్రహ్మశ్రీ రాజశేఖర వెంకటశేషకవులు. గుత్తిపురమునకు విచ్చేసి శతావధానము నొనరించిరి. ప్రశ్నలలో 3 వంతులు దుష్కర ప్రాసములుగలకఠిన సమస్యలై దుర్భేద్యములై యుండెను. ఈయవధాను లసాధారణ ధారణాధోరణులు గలిగి అనర్గళకవితాధారచే యిచ్చిన ప్రశ్నలన్నింటిని రసస్ఫూర్తి నెలయున ట్లవలీలగాఁ బూరించిరి. వీరి పాండిత్య కవిత్వపటుత్వములకు మెచ్చి దత్తమండల ప్రథమావధానులైన వీరికి రత్నకంకణములు కానుకగా నర్పింపఁదలఁచి ప్రత్యేకసభ చేసి 10-9-22 తేది మా గుత్తి పౌరవిద్వజ్జనంబుల పక్షంబు

గౌరవనీయులయిన దివాన్ బహాదూర్ పి కేశవపిళ్ళగా రవధానులను మిక్కిలి ప్రశంసించి స్వర్ణకంకణములను సమర్పించిరి. గుత్తి డిస్ట్రిక్టు మునసఫుగారగు శ్రీమాన్ యన్. యస్. నృసింహాచార్యులుగా రవధానుల నభినందించుచు ఆ స్వర్ణవలయములను స్వయముగా వారిచేతులకుఁ దొడిగిరి. బహునూసము చేసిన పిదప మహాశయులు కొందఱు కఠినంగమకఠినములయిన ప్రశ్నములొసంగఁగా నవధాను లత్యుత్సాహముతోఁ బూర్తిచేసిరి. ఈయవధానులవలన దత్తమండలము లజరామరకీర్తినొందుచున్నవి. ఆయురారోగ్యైశ్వర్యము లొసఁగి పరమేశ్వరుఁడు వీరిని గాపాడుఁగాక,

ఆంధ్రపత్రిక.
15.9.1922.



గుత్తిపురమున 6-9-22 తేదిని పొద్దుటూరు వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ రాజశేఖర వెంకటశేషకవులు శతావధానము నొనర్చిరి. వీ రెట్టి కఠిన ప్రశ్నములనైన నెదుర్కొని యనర్గళకవిత్వధారచే రసవంతముగ కవనమల్లఁగలరు. వీరియవధాన సామర్థ్యమునకు మెచ్చి వీరిని గౌరవించుటకై గుత్తి పురవాసు లొక సభయొనర్చిరి. డి బ॥ పి. కేశవపిళ్లగారు అవధానులను మిక్కిలి ప్రశంసించుచు సభాపక్షమున రత్నకంకణముల వారికి కానుకగా నొసంగిరి. డిస్ట్రిక్టు మునసబుగారగు శ్రీమాన్ యన్. యస్. నరసింహాచార్యులుగారు అవధానుల

ఁభినందించుచు ఆ బంగారు కడియములను స్వయముగావారి హస్తములకుఁ దొడిగిరి. మామిత్రులగు నీ శతావధానులు యేప్రాంతములకు వెళ్ళినను నిట్టి సత్కారములను బొందుచు సత్సమండల పూర్వప్రతిష్ఠల నిలువఁబెట్టుచున్నందుల కెంత యు సంతోషించుచున్నాము.

పినాకిని,

16-9-1922.

---

## 10-7-23 తేది కోవెలకుంట్ల తాలూకా ఉయ్యాలవాడలో జరిగిన యష్టావధాన విధానము.

జి. వెంకటశేషశాస్త్రిచే జరపఁబడినది.



మ॥ లలితా! యీసభలున్ సదస్యులు రుచుల్ ప్రశ్నోత్తరం
బుల్ రసం। బిలసర్వమ్ముఁ దరంగముల్ నడచున ట్లేనాఁటి
కానాఁడు క్రొ। త్తలు ముగ్ధానవసంగమంబువలె మోదం
బిచ్చుఁగాకన్నిఁటన్। వలపింపన్ గెలిపింప నీకరుణసంభావ్య
మ్ము కామేశ్వరీ.

అవధానము

(1) సమస్య.

ఉ॥ కల్లలు బొల్లు లాడుటనఁగా నది యిట్టిది వేయి చిల్లులన్
జెల్లెడుకుండనిండ నిలచెన్ జలపూరము, గుంటివాఁడు మో

కాళ్ళనెసంచరించెను జగంబఖిలమ్ము నిమేషమాత్రలో
(బల్లికి రెక్కలేర్పడియుఁ బాము మ్రింగెనెలుంగువీపుపై.)

(2) సమస్య.

క॥ సద్వ్యాఘాతము నిండె వి
యద్వ్యాప్తి శౌరి చక్ర మడుపఁబఱప నా
పద్వ్యథితుఁడయ్యె గ్రీడి (జ
గద్వ్యాప్తములయ్యె నిరులు ఖరకరుఁడుండన్.)

(3) ఇట్టి, మట్టి, జెట్టి, కట్టి, యీపదములు వచ్చునట్లు రామాయణపరముగా మత్తేభము.

మ॥ అవనిన్ గట్టిదనంబు వాసిగనె రామాధీశు మైచాయయై
దవిలెన్ జెట్టియుఁ బాశరూపరిపువై తల్పంబుగానుండి పా
ల్పువిడెన్ మట్టియు రాముఁడై జలజనాభుండుర్విజన్మింపఁదా
నవనాశంబొక యిట్టికూత సలిపెన్ రామాయణంబందునన్

(4) సమస్య.

మ॥ భువిస్త్రీపుంవ్యవహారదూరుఁడగుచున్ బాల్యారుబ్రహ్మం
బునై। జవిలాసంబునఁ బేరితుండగుచు నిచ్ఛాస్ఫూర్తిఁగ
ల్పించె నీ। భువనోత్పాదినిమాయనాఁగనపుడే పుట్టించెనీ
వార్తయున్। (యువతీరత్నము పుట్టె షండునకుఁగా మోద్రే
కముప్పొంగఁగన్.)

(5] వ్యస్తాక్షరి.

యక్షశ్చక్రే జనకతనయా స్నాన పుణ్యోదకేషు.

(6) నిషిద్ధాక్షరి.

రికార్డు లేదు.

(7) గంటలు 127.

(8) అధికప్రసంగము.

(9) ఏకసంధ.

ఉ॥ పాదలఁగఁ బ్రాఁత పాత్రములఁబూర్వపుఁ బద్యములిత్తుమే
నిసీ। చదివియెయుందువంచుమదిసందియమొందియుఁగొ
త్త పద్య మిం। పాదవఁగ వ్రాసి యిచ్చితి నొహాశకవిశేఖర!
యేకసంధఁగాఁ। జదువుముదీని, సర్వబుధసత్తములుకా వె
రగందునట్లుగన్.

(10) సమస్య. ✓

ఉ॥ ఆడకు నాడకే జరగునట్టి యొకానొక జంగమయ్య పెం
డ్లాడఁ బ్రయాణముకా సలిపి యచ్చట రంగపురంబులోననే
వాడలఁబోవఁజూచినను వానికెదుర్పడఁ జొచ్చె నామముల్
(మూఁడునుమూఁడు మూఁడునఁటిమూఁడును మూఁడును
మూఁడుమూఁడుగన్.)



12-8-1923 తేది భానువారము చెన్నూరుపురమున
జరిగిన యవధానము.

—o—

మ॥ ననుధ్యానించుచు నాపదాబ్జమకరందం బానుచుకా నన్నున

ఖిన్ననవారికి వృలంచు మావయని గూర్మిఁ గాలోఁ బ్రవేశించిగో
రినచందంబునఁ బ్రశ్నముల్ దగిలి పూరింపఁగా బలంబిచ్చి కీ
ర్తిని నీవే కొని తెచ్చియిచ్చెదెపుడున్ దేవీ గిరీంద్రాత్మజా

రాజశేఖరం.

శ్లో॥ ప్రాతః ప్రస్ఫుట దంబుజోదర దళ ప్రస్పర్థి నేత్రాంచల
స్యంద స్నంద మరంద బిందు నవధారాశోభి తే వీక్షితం
గంగా తుంగ తరంగభంగి పటువా క్సంపత్తి సంపాదకం
సేవాభాగ్యజుషాం ప్రసారయము యి శ్రీదేవి! కామేశ్వరి!

వెంకటశేషశాస్త్రి.

అవధానము.

[1) రాముని చరిత్రము ఉత్పలమాల.

ఉ॥ రాముఁడు సూర్యవంశమువిరాజిలఁబుట్టిమహీజఁ బెండ్లియై
భామినితో నరణ్యముల బాధలనొందుచు నుండ రావణుం
డామహిళన్ గ్రహించిచననాహవమందతనిన్ వధించుచున్
గామిని సంగ్రహించెనని క్రాలెదు రాముచరిత్రమిద్ధరన్.

(1] సమస్య. ✓

శ్లో॥ భక్తాః కేచి ద్బహుళ ధన సంపాదనై క ప్రవీణాః
భార్యాశ్శయ్యాతనుజతురగా శ్చిత్రచిత్రప్రచారాః
నానాయోనిష్వపి జని రహో మే విధిః కేలిచింతా
మూఢోహిత్వా సకలవిభవందాగుభూత్సో మురారిః

3, సమస్య.

(కేశవం పతితం దృష్ట్వా) పార్థ శ్చుక్రోశ దీనవత్
గయం త్రాతుం ప్రాణబంధు మహాంతం త్వాం విలోకయన్

4. సమస్య.

చ॥ ప్రమదముగల్గు భర్త తనభామను జేరఁగఁబిల్చి ముద్దు లే
గొమరుమిటారి లేమ! యిదిగో తెలియన్ వివరింతు నేఁడు పూ
ర్ణిమ, పదునైదునాళులకు నిక్కము చేరఁగవచ్చుఁ జుమ్మి యా
[యమృతమవస, నేఁట రేయిక నుమ్ముల దె చంద్రకళావిలాసముల్.]

6. సమస్య

క॥ క్షీరాబ్ధిఁ దచ్చి యమృతము
సౌరతతికిఁ బంచిపెట్టు జలజాక్షుని కాం
తా రూపముగని "నఖజిత
[తారా' రావన్న యనుచుఁ దన్నుం బిలిచెన్ ]

7. విష్ణుప్రార్థన - నిరోష్ఠ్యము - గీతము.

ఆ॥ వె॥ రక్ష సేయు శౌరి రక్షోనికరహారి
కంధ నీల చారు కనక చేల
శ్రీకళత్ర లోకసృష్టి రక్షణ సూత్ర
యనుచు నుతులు సేయ నగును జనులు.

8. సమస్య దాక్షిణ్యహీనా వరశాంతిదూరాః
ఆహార నిద్రాది చతుష్క ధీరాః
భీరుప్రహారే ష్వతిమాత్రశూరాః
(మనుష్యరూపాః పశవశ్చరంతి)

9. సమస్య.

క॥ తరువుల దోహద మెఱుఁగక
తిరిగెద వొకమాట నేస తెలిపెద వినుమా
యరుదారఁ బూలుపూచును
(కొరవిని గాఁగిటనుజేర్చుకొనుము లతాంగీ!)

10. సమస్య.

క॥ కనుఁగవ నీలోత్పలములు
వనజద్వయి పాదయుగము పల్లవము గు లే
నునుఁబెదవి గొప్పకొండలు
[చనుఁగవ; మధ్యంబు చదలు; జలజాక్షికొగిఁ.]

11. న్యూ-లునందలి వటములోని సముద్రవర్ణనము-సీసము

సీ॥ అవనిసజ్జనులట్లు లతిదూరమునకొండు
భాసిల్లుచుండు ద్వీపములగములు
రి క్తునిమనసు కోరికలట్లు పుట్టె జో
రనగిట్టు తుంగతరంగములును
మహితవేగముగల్గు మదరాసునేలట్లు
లురవడిఁజనునట్టి యోడగములు
ధై ర్యంబునను మమ్మఁదలఁగఁ గొట్టెడువారు
కలహోకోయన నిల్చుతన్మోధరములు.

తే॥ గీ॥ గలిగి చెలఁగుచు నుండెడి కంథియిచట
బాలికాపాఠశాలలోఁ బటమునందుఁ

జూచువారిమనంబులు చూఱఁగొనుచు
నరస వెలుఁగొందు నోసభాస్తారులార!

12 సమస్య. పదములునాల్గుగూర్చినను పద్యారెక్కె తమనంగఁ
జెల్లునే.

చ॥ సనయుఁడుసద్గురూత్తమునిసన్నిధి విద్యలునేర్చి; కొల్చికో
విదులను. దేవికూర్మిని గవిత్వము సెప్పినఁజెల్లు నేవిధో
(పదములునాల్గుగూర్చినను పద్యారెక్కె తమనంగఁజెల్లునే
వదినెకు మీానముల్ నిలిపి బాపురె బావయనంగ వచ్చునే?

14. చెన్నాురి సమీాపమునఁ బినాకినీ వర్ణనము-మత్తేభము.

మ॥ జననం బందినదాది యిందనుక దేశంబెల్ల నీరంబులన్
గనుపింపన్ గనుబోక, భుమ్మగిరిచెంతన్ స్వామిపాదంబులన్
గనిసేవించుటకోయనన్ జలముచక్కంగారహింపన్ బినా
కినియున్ జీవనదీసమాఖ్యఁగొని యిా ్రకేవన్ బురిన్ వర్తిలున్.

15. గాంధిగారి కారాగారవాసము మత్తేభము.

మ॥ పవలెల్లన్ గగనప్రచారమునఁ దాపంబొందుచున్ దేపునా
త్మవిలాసంబున లోకసంతతుల యజ్ఞానాంధకారంబుఁ జీ
ల్చవెనన్ వెల్వడ నీదినం బపరదిగ్వారాశి విశ్రాంతి నొం
దువివస్వంతుఁడువోలెగాంధిచెఱనుండున్ గూఢతేజస్కుఁడై

16. సమస్య.

నశోకహేతౌ రమతే రసజ్ఞః

శుకో గిరతుం నూత్నరతౌ కిమిచ్ఛా
జిఘ్రత్యళిః కిం నవచంపకం కిం
[చంద్రోదయం కాంక్షతి చక్రవాకీ?]

17. ప్రపంచములోని యేడుచిత్రములు.

సీ॥ కోహినూర్ మణి వెలుఁగొందు మయూరసిం
హాసనంబును టాజ్ మహాల్ కుటుబ్మి
నార్ శిలాస్తంభ మున్నతిగన్న యీజిప్టు
విషయమందలి పెద్దపిరమిడులును
హర్క్యులీసనెడు మహాబలుబొమ్మ మా
స్కో-పురంబున నొప్పు గొప్పగంట
పైసాయనెడు పురప్రవరంబునను వంపు
గొని జాఱకుండెడు గోపురంబు
తే॥ గీ॥ ననఁగ నియ్యేడు వింతలై యడరుఁ గాని
యేడులో మూఁడు చూడంగ నిండియాకుఁ
బ్రభ నొసఁగు నన్నిఁటికి శిరోరత్నమగుచు
రాజిలెడుఁ గోహినూర్ రత్నరాజమెప్పుడు,

18. సమస్య. ✓

క॥ క్రన్ననఁ జేపంబు వట్టఁగఁ
గన్నియ వల భుజమునందుఁ గాలి నదికిఁబో
నన్నపుడు పైని యా వల
[కన్నులలోఁ జన్నులుండెఁ గాంతామణికిన్.]

20. అవధానముఁ జూడవచ్చిన యిసపుసు మోటువాండ్ర సంభాషణము సీసము.

సీ॥ అగుదాసమంట దొరబ్బరో యిద్దఱు
సిన బాపనయ్యలు చేస్తరంట
అగుదానమన సుద్దులా యేంటిరా సెప్పు
వారింకబలనొట్టు వారలెవరు?
అదికాదచీ యెవ్వ రడిగినఁగాని క
యిత్తంబుసెప్పి మెప్పింతురంట
కాశేరికతకాడ తగాండ్లందఱు
సిల్లిగవ్వకునైన సెల్లిరారు.
తే॥ గీ॥ ఏమిలేకుండినను పెద్దలెల్ల ఇటు
కనుగొనగవత్తురా యెన మనముగూడ
తాళిసూత్తమటంచవధానసభకుఁ
బామరులు మాటలాడుచు వచ్చుచుండ్రు.

21. సమస్య.

మ॥ వ్యసనంబుల్ విడనాడి మేలిసుఖముల్ వర్జించి తర్జించు స
త్వసమూహంబులసాదుసేసి యెపుడున్ బ్రహ్మైక్యసంధానస
త్వసమాధిన్ బ్రబళీయాంతమున్ గదిసినన్ సాణుక్రియన్ సి
ల్చుతా! పసులన్ గొల్చెడి వారికబ్బుటకుదే భద్రంబులెల్ల
ప్పుడున్.

22. రామకృష్ణశాస్త్రిని గుఱించి శ్లేష గీతము.

తే॥ గీ॥ అలఘుభద్రాన్వితుండు సత్యాశ్రయుండు
పుండరీకాయతాక్షుండు పురుషవరుఁడు
రామకృష్ణు కళారూఢి ధీసుహితులు
తెలియఁగానేర్తురి తర్కకుల్ తెలియఁగలరె?

23. సమస్య.

తే॥ గీ॥ గొఱియల నద్రుంచు గ్రామజాతరల యందుఁ
దగ సహింసను వెదుకఁగాఁ దలఁచువెల్ల
గంగగోవును గోల్పోయి కడకుఁ బంది
మంద వెదకిన చందమీ మహిఁ దలంప.

అవధానాంతమునఁ గవులుచదివిన పద్యములు.

శ్లో॥ పోతనాది కవివ్రాత పోషితా కవితాలతా
జాతాద్యపుష్పితా యుష్మద్వాగ్ధారామృతసేచనాత్.
శ్లో॥ సైషా భవతోః కవితాకోమలవాక్యార్థరసపరిస్ఫురితా
ఆమోదమావహంతీ సామాజికచేతసాంచిరంజయతాం

ఉ॥ ఒండొరుమీఱు నవ్యచతురోక్తి చమత్కృతిమంజుయుక్తిన
త్పాండితికల్పనంబు రసభావములుం బెనుపొందఁ జేయుటీ
పండితయుగ్మమందుఁ గనుపట్టుట నిట్టిమనీష పూర్వ మా
ఖండలమంత్రి కావ్యులకుఁ గల్గుటనిక్క మటంచు నెంచెదన్

క॥ కవియొక్కఁడె గురుఁడొక్కఁడె

యపనిరళభముగ బుధుఁడొకండె యలదివి; భువి నీ
ప్రవిమల మనీషు లిరువుర
కవి గురు బుధులైరి చూడఁ గడుఁజిత్రముగన్.

నేరేళ్ళపల్లె రామకృష్ణశాస్త్రి.

శా॥ మత్తా వినీతకవినీరద చండవాతా
వాత్తావనీపతి బహూకృతిజాత గీతా
దత్తావనీ సుకవిమండల పూర్ణచంద్రా
శ్రీరాజశేఖర సువెంకట సత్కవీంద్రా.

శా॥ అస్మద్భాగ్యమహో మహాజనసభా సంప్రార్థితౌ మత్పురే
లీలాకల్ప శతావధాన రచనా వ్యాజేన సంధ్యా నట
ద్భర్గోడగ్ర శిరస్సరిత్కలకల వ్యక్కారి వాక్కౌశల
ప్రస్విద్య త్కవితామృతేనవిబుధానస్నాపయేతాం చద్రధుః

శ్లో॥ అహం కిమితి వర్ణయే భువనపండితాఖండలౌ
స్సహస్రముఖవర్ణిత ప్రథిత పాండితీ మండితౌ
సుదుష్కర శతావధాన జయలబ్ధ సింహాసన
స్ఫురత్కనకఘంటికా కటక కమ్ర హస్తాంబుజౌ.

ఇట్లు విన్నవించు,
చింతలపల్లె వెంగళ్ళరాయశాస్త్రి.

12–8–23 భానువారము చెన్నాపురమున బాలికా
పాఠశాలాభవనమునఁ బురప్రముఖులందఱుకోరికపైన విఖ్యాత

దత్తమండలశతావధానులగు బ్ర॥ రాజశేఖర వెంకటశేషకవులు శతావధానము నొనరించిరి. ప్రశ్నములలో మూఁడువంతు లత్యంతకఠిన సమస్యలు. వర్ణనములును గవులభావనాబలమును ధారాశుద్ధిని నిరర్గళధోరణిని బరీక్షించుటకై ప్రత్యేకముగ నేర్పఱుపఁబడినవి. సహజకవిత్వపటుత్వమునను ధారాళధారాప్రవాహమునను అచ్యుతధారణాబలమునను శతావధానులు ప్రశ్నముల నన్నిఁటి నెదుర్కొని 23 పృచ్ఛకులకు రెండున్నరగంట కాలమున మిక్కిలి రసవంతముగ నుండునట్లు కవిత్వము చెప్పి సభ్యులనందఱ సంతోషాంబుధి నోలలాడించిరి. గుత్తి నెల్లూరు మొదలగు పురప్రవరముల నవధానములొనరించి సింహకంకణాది బహుబహూకారంబులొంది ధవళయశశ్చంద్రికల దత్తమండలములఁ బరిశోభింపఁజేసిన వీరి కవిత్వపాండిత్యములు అనర్గళధార రసస్ఫురణములోనగు గుణంబుల గుఱించి ప్రత్యేకముగా వచింపనవసరముండదు. వీరు మాపురమునకు విచ్చేయుట మహాభాగ్యమని మేము తలంచుచున్నాము. ఇట్టి కవియుగ్మంబులవలన మాదత్తమండలములే గాక సమస్తాంధ్ర మండలములును శాశ్వతకీర్తింగనె ననుటకు సందేహము లేదు. అవధానభాగము నందలి పద్యంబులఁ గొన్నింటి నుదాహరించుచున్నాము,



పినాకిని 25–8–1923.

దీనికాపీ మాతృసేవ, 17–8–1923.

3-9-23 తేది కడపపురమునఁ దత్వజ్ఞాన సమాజభవనమున
బ్ర॥ గొల్లకోట గంగాధరసోమయాజి యం.ఏ. బి.యల్.
జిల్లాజడ్జిగారి యధ్యక్షతక్రింద జరిగినయవధానము.



శా॥ అమ్మా! నిన్నేకమాఱు మానసములో ధ్యానించినంతన్
బ్రవా। హమ్మున్ బోలె భవత్కృపారతి పయిన్ వ్యాపించు
చున్ వేయిహా। స్తమ్ముల్ కప్పినయట్లు మమ్ములనురక్షల్ సే
యునీకూర్మి గా। కిమ్మాడ్కిన్ సభలన్ జయంబుఁగొన నేదీ
యూఁత కామేశ్వరీ!

సీ॥ ఏమహామహుఁడు సంస్కృతపాండితిని గొప్ప
పర్వతంబని నుతుల్ పడయఁగలిగె
నేఘనుం డాంధ్రమందెల్ల పండితులచే
దిగ్దంతియనుచుఁ గీర్తింపఁబడియె
నేసద్గుణార్ణవుం డెల్లెడఁదర్క సిం
హుఁడటంచుఁ బెనుకీర్తి నొందఁగలిగె
నేకోవిదవతంసుఁ డాకౌముదిఁ దనంత
ఘనుఁడు లేఁడనుచు విఖ్యాతిఁగాంచె.
తే॥ గీ॥ నట్టి కందాళ్ళవంశ సుధాంబురాశి
చంద్రుఁడైన దాసాచార్యసత్తముండు
గురుఁ డతనికూర్మి సభల నేశాఱుఁత లేక
రక్షయిడుఁగాత శ్రీరామ రక్షయగుచు.

సీ॥ కలుపుట మొద లంకగణితంబు లీలావ
తీ గణితము దాక దిద్దునపుడు
కడపయు మొదలై దుఖండముల్ దాక భూ
గోళవిద్యా ప్రౌఢిఁ గూర్చునపుడు
ఋగ్వేదమందుండి యెడ్వర్డువిభుదాఁక
దేశచరిత్ర బోధించునపుడు
ఫోర్తుఫారము మొదల్ మొగిమెటిక్లేషను
నందాంగ్లమును నేర్పి యలరునపుడు.
తే॥ గీ॥ చెంపలనుగొట్టి బుద్ధులుచెప్పి దేహ
బలమును మనోబలంబు గాపాడినట్టి
సాధ్వరసన్వయువారాశి చంద్రతుల్యుఁ
దలఁతు సర్వోత్తమార్యుఁ జిత్తంబునందు.

సీ॥ లాబుక్కుచూడక కేలాటి ప్లీడరుగాని
సెక్షనులన్నియుఁ జెప్పఁగలఁడె?
టెక్ష్టులఁజదువక కేటీచరైననుగాని
తెలిసి పాఠములు బోధింపఁగలఁడె?
పంచాంగముల తోడుగాంచకే దైవజ్ఞు
డైనముహూర్తంబు నడుకఁగలఁడె?
లెక్కబుక్కు పరిశీలింపకే ధనిజమా
కర్చులింతనుచుఁ బల్కంగఁగలఁడె?
తే॥ గీ॥ కాపునను సందియంబులు గలుగువేళఁ
బూర్వకవులప్రయోగ మప్పుడవచింతు

నాట్యముకాదేని యొకగడె యవలనైనఁ
జెప్పి మెప్పించెదము బుధశ్రేష్ఠులార!

డి. రాజశేఖరం

క॥ కవులారా యీసభనిచ్చు ప్రశ్నములు చక్కఁగొండలై దూక
బెం। డునలెఁ జిమ్మఁగఁ జేయుచుఁ జయము నెప్డుఁ మాకుఁ
జేకూర్చి గా। రవముఁ నిల్పిన నీకటాక్షమిపుడుఁ రానిచ్చి
సత్కీర్తివై। భవముల్ నిల్పికొనంగనమ్మ జగదంబా! దేవి
కామేశ్వరి!

సీ॥ ఎవ్వాని కువనిష దేశాంతతత్త్వమహా
బ్రహ్మవిద్య నిరంతరప్రసన్న
సంగీతసాహిత్య శాస్త్రంబులెల్లనే
యనఘువశంవదలైన బిడ్డ
శ్రీమహామహుగేహ మిందిరాదేవికి
విడరాని కూర్మి పాల్కడలిమేడ
యేగురూత్తముశిష్యు లీపాటిసభల ని
ష్కంటకులైన నావంటివార
తే॥ గీ॥ లట్టి రూపావతారాన్వయాబ్ధి శీత
కిరణుఁడౌ శేషశాస్త్రి మద్గురువరేణ్యుఁ
డిడిన యాశీస్సులే నన్ను నింతవాని
సలిపి పేరిచ్చెఁగాక నాశక్తిగలదె?

వెంకటశేషశాస్త్రి.

## అవధానము.

1. ఖగము, నగము, లగము, సగము, పాదాదిని వచ్చునట్లు భారతపక్షమునఁ జంపకమాల.

చ॥ సగముధరిత్రి పార్థులకొసంగుఁడటంచని యోగ్యులెల్ల నో
లగమునఁబల్కనొప్పక మెలంగును యోధను వానితమ్ములన్
నగముల ఱెక్కలన్ దివిజనాయకు వజ్రమునట్లుచీల్చుచున్
ఖగములు మెక్కఁజేతువడిగాననె భీముఁడు భారతమ్మునన్

2. దాక్షిణాత్యులపర్యటనము. హాస్యప్రధానముగ మత్తేభము.

మ॥ పలుకష్టంబుల నుత్తరధ్రువధరన్ బ్రాపించి శైత్యవ్యథా
కలితుండై యొరగన్ 'క్షణానకొకకప్ కాఫీగొనుండుష్ణము
గలిగించున్ జూడి' యన్న 'నీవెవఁడ'నన్ ''గాఫీటిఫన్ లిత్తు నీ
స్థలమందాఖ్యమణయ్యర'' న్నఁబడె మేజర్ బ్లైకుపీతాశుఁడై

3. ఈశ్వరుని వర్ణనము. అచ్చతెనుఁగు-సీసము.

సీ॥ నిగనిగల్ దులకించు సగముచందురు రేక
గుంపెడుజడలపైఁ గులుకుచుండ
గుంపెడుజడల డాఁగురుమూఁతలాడెడు
మినువాక యుప్పొంగిమెఱుఁగుచూపఁ
బెద్దముత్తైదువై పేరుగాంచిన యట్టి
చాన సామేనున సౌరుగూర్ప
నేనుఁగుతొండంబు నిటునటుద్రిప్పుచు
వెనకయ్య తొడలపై వేర్మినింప

తే॥ గీ॥ నైదు పదిసేయు వారల నరయు కొఱకు
వెండికొండను నెలకొన్న వేల్పుఱేడు
గట్టురాచూలి కూర్మి మగండు మమ్ము
మిమ్ము నందఱం బ్రోచుత మేలుగూర్చి.

4. సమస్య.

శా॥ కంధ్యాడంబర మింత హెచ్చె దివిఁజుక్కల్ మొల్వఁగాఁ
జొచ్చెనం। చాంధ్యంబొప్పఁగఁ దీవరింతురతికై యంతర్బ
హిశ్శుద్ధతన్। (సంధ్యావందనమాచరింపవలదా చౌశీతి బం
ధంబులన్) వంధ్యత్వమ్ము నుదీర్తు వేజనికి కాంతాచారు కేళీ
గతిన్.

5. సమస్య.

బలాద్గృహీతా దశకంధరేణ
రంభా చలద్గాత్రలతా భయేన
మామేత్యశంతీ కురరీవ భానాం
[పత్యుఃపురస్తాచ్ఛ్వశురేణ రేమే.]

6. సమస్య. భారత పర్యాయముగా నర్థముండవలెను.

మ॥ సకలోర్వీన్ గెలువంగఁజాలిన మహాసత్త్వుండవై యర్జునా
వెకలుల్ కౌరవులీయరణ్యములకంపింపన్ జలంబేది (యూ
రక నీకీచుని వృత్తి నుండఁదగునే రక్షోగణాధీశ్వరా)
గకుతారంబగు గాండివంబున విపక్ష వ్రాతమున్ గూల్పుమా!

7. సమస్య.

చ॥ పరమమునీశ్వరుల్ గ్రహణపర్వము సేఁతగఁ బటుఁ దమంతవ
చ్చిరి. శతవృద్ధులందఱు, నిశిన్ గడుదవ్వున గంగకేఁగఁజా
లరుమనయింటనుండి కనులన్ గని చందురు గాఁపాలు సంప్రికా
(తురకలుసంధ్యవార్చురటతోయములన్ గొని తెమ్ము జానకీ.)

8. సమస్య.

వాతోత్థమృత్పూర్ణతలే విశాలే
కాకాదిసంపాదిత బీజయుక్తే
సద్యఃపయోముక్ జల సేచనార్ద్రే
(శిలాతలే సస్యమిదం రుహోహ)

9. ప్రెసిడెంటుగారిని గూర్చి మత్తేభము.

మ॥ వరపావిత్ర్యమునందుగంగయగుచున్ భాస్వత్కళానాథశే
ఖర సర్వజ్ఞ మహేశ్వరత్వములనున్ గంగాధరుండై యశో
భరగంగాధరసోముఁడై సుకవితావ్యాపారనామంబులన్
బరగంగాధరసోమయాజియగునీభవ్యున్ బ్రశంసించెదన్.

10. సమస్య.

క॥ ఘనమైన పాలవెల్లిని
ననుపమమగు శేషశయ్యయందున నిద్రన్
గనుచుండెడి లక్ష్మీకాం
(తునిలో లోకంబులెల్లఁ దూఁగుచునుండెన్)

11. సమస్య.

చ॥ గురుఁడని దైవమంచుఁ దనుఁ గూర్మి భజించెడు దేశమంచుఁ బ్రే
మరసమునింత చూపకయె మండెడు నిప్పులఁ గ్రుమ్మరించునా
కరణిని భానుఁ డెండలసెగన్ సొగయించెడు దత్తమండలిన్
(బరులకు మోదమబ్బినను మానిన నైజము లెక్కసేయునే)

నైజమనఁగాఁ బ్రకృతియని పృచ్ఛకులగు డిస్ట్రిక్టు యెడ్యకేషన్ ఆఫీసరుగారు గ్రహించి చెప్పుచునిరి.

12.

ఉ॥ దీపములన్ దటాలుమని తీసినఁ బొల్చు గృహంబు కైవడిన్
పాపములన్ని యొక్కటిగఁ బండిన యట్టి భూమండలంబునన్
బాపినఁ గష్టముం దలినిఁ బండిత పామరు లెల్లవారు సం
తాపము నొందకుండెదరు దైవము వారికి మేలుగూర్చుతన్.

13. దాక్షిణాత్యులఁ దిలకించి యాంధ్రులసూయపడుట యేల
శార్దూలము.

శ్లో॥ విద్యాభ్యాస విధౌచ కష్టసహనే విస్తార మేధాబలే
సౌఖ్యంచావిగణయ్య నైజమనిశం శ్రేయోవిధాప్రీణినాం
దత్తానుత్తమదాక్షిణాత్యసహజానాంధ్రా అసూయేయురాః
కస్మాదిత్యుపజాయతే మనసి మే తర్కో వితర్కాకులః

14. సమస్య.

శుక్త్యాపతజ్జల ముపైతి సుమౌక్తికత్వం

వద్దేనత త్వద్భృశతామపి మౌక్తికస్య
తస్మై౽యసి వ్రజతి నిస్తనుతాం తథైవ
(దానంధ్రువంఫలతి పాత్రగుణానుకూల్యాత్ )

15. దాక్షిణాత్యులాంధ్రులను దప్పులుపట్టు కారణములు తె
లుపుఁడు సీసము.

సీ॥ రైలుమార్గముల డేరాడూనులో టికె
ట్టియ్యఁగా మేముగా కెవ్వరనుచు
లండనుపురిని జెలఁగు హోటలులఁ గాఫి
నీయఁగామే ముగా కెవ్వరనుచు
నెవరెస్టుపైనైన నింజనీయరులమై
యేగఁగా మేముగా కెవ్వరనుచు
నాఫ్రికాష్ట్రేలియా లందున డెపుటేష
నేగఁగా మేముగా కెవ్వరనుచు.

తే॥ గీ॥ మొగిని గూపస్థమండూకముల విధాన
నాంధ్రదేశంబు విడువలేరయ్య యనుచు
దాక్షిణాత్యులు మనయందుఁ దప్పుపట్టఁ
బోవుదురుగాని కోపింపఁబోము మనము.

16. మద్రాసు కాఫీహోటలులలోని పరిశుభ్రతా చారముల
ను గూర్చి గీతపద్యము.

తే॥ గీ॥ పాకమొనరించువారు నానాకులజులు

కలయ వడ్డించువారు మంగలులదిబ్బ
గాఁగ మదాౄసుపురమందుఁ గాఫిహోట
లులను శుభ్రతాచారముల్ గలుగవెపుడు.

17. అరణ్యవాసమున కేగుచు రాముఁడు కౌసల్యయొద్ద సెలవు గైకొనుట సీసము.

సీ॥ అమ్మరో! మాయయ్య యతివృద్ధుఁడైయుండెఁ
జిత్తంబునరసి పోషింపవమ్మ!
సవతులంచనియెంచి సాధ్విసుమిత్రఁ గౌ
సల్యఁగష్టముపాలు సలుపకమ్మ
భరతుతో నీదుసోదరుఁడు శ్రీరాముఁడా
శీర్వదించెనటంచుఁ జెప్పవమ్మ
నను దైవమంచు మన్ననసేయు ప్రజలను
గన్నతల్లివిధానఁ గాంచవమ్మ.
తే॥ గీ॥ తండ్రియాజ్ఞను శిరమునఁ దాల్తునమ్మ!
నీపదంబుల మఱువంగ నేరనమ్మ!
ప్రేమదొలుకాడ మమ్ము దీవింపవమ్మ!
వనములకుఁబోదు సెలవిచ్చి పంపవమ్మ!

18. తగరు,నగరు,వగరు,సగరు పాదాదినివచ్చునట్లు చంపకము.

చ॥ నగరులనన్నిఁటిన్ వెదకినన్ దమయశ్వము జిక్కకుండఁబో
వ గరువమొప్ప భూవివరభాగముఁజొచ్చి ప్రచండచండిమన్
సగరు కుమారకుల్ కపిలసంయమిఁ దాఁకిరి మూర్ఖచిత్తులై
తగరునగంబుతో నొరసి తాఁకెడుచందము దూషిసేయుచున్

19. విరసము, సరసము, దురితము, గరువము పాదాదినివచ్చు నట్లు భాగతపర్యాయముగాఁ గందము.

క॥ సరసములగు పనులుండఁగ
దురితములకుఁబోవనేల దుర్యోధన! నీ
గరువము సెడుఁ బార్థులకడ
విరసముగాఁబోక పాలు విడువుము పుత్రా!

20. సమస్య. లోకేనేయం శూన్యతే చిత్రశాస్త్రా
తత్త్వవ్యాఖ్యా బోధనే శిష్యపఙ్క్తేః
హస్తేకుర్వన్ శశ్వశృంగోరుచాపం
(వంధ్యాసూను ర్దృష్టవా నభ్రసూనం.)

21. సమస్య.

క॥ వేలకువేలుగ యవనులు
వ్రాలఁబ్రతాపుఁడును భటులు పైకొని చనఁగా
నాలమ్మున వారల కర
(వాలమ్ములు త్రుంచె యవనభటశీర్షములన్)

3-9-23 తేది కృష్ణజన్మదినమున సాయంతనము 4 గంటలకుఁ గడపపురమున దివ్యజ్ఞాన సభాభవనమున శతావధానులును విఖ్యాత కవివతంసులునునగు బ్ర॥ రాజశేఖరవెంకటశేషకవులు శతావధానము నొనరించిరి. కడపపురమున మండలన్యాయమూర్తియు సంస్కృతాంధ్ర సారస్వతసారసర్వజ్ఞుఁడునునగు బ్ర॥ మ॥ గొల్లకోట గంగాధర సోమయాజి యం.ఏ. బి యల్.గారు అగ్రాసనాధిపత్యము వహించిరి. అవధానము నుండి కొన్ని పద్యముల నుదాహరించుచున్నాము. (పినాకిని,)

## Swarajya 8-9-1923.

### Cuddapah Satavadhanam performance.

Two young men of Proddutur Rajasekhara kavi and Venkataseshakavi performed satavadhanam in Telugu and sanskrit in the Theosophical hall cuddapah. Our new District Judge M. R. Ry. G. Gangadhara Somayaji Garu, M.A. B.L. Presided over the function. About 30 or 40 questions including samasyas, descriptions of nature, references to several subjects of current interest were handed over to the Avadhanees. For want of time the questions were limited to 21. They answered aptly, beautifully, humorously and entirely to the satisfaction of the audience provoking now and then loud cheers and applause. Appreciative verses as regards the performance of the Avadhanees were then read both in sanskrit and Telugu. The President in conclusion highly appreciated the abilities of the young poets (and earnestly hoped that they would bring a very good name to the Ceded Districts) One questioner asked the poets to describe the condition of Cuddapah in the event of her dismemberment. They answered that it would he like a house with its lamps suddenly blown out. Influential men are trying to suitably reward the talented young men

---

### 16-9-23 తేది జరిగిన సన్మానసభ

మ॥ అజశక్రాద్యమరార్చితుండును లలాటాక్షుండు భూతేశుఁ

డం। గజవిధ్వంసి గజాసురాంతకుఁడు భక్తశ్రేణులన్ గూర్మినే। లు జగత్పావనుఁడైనతల్లి, నినుఁగొల్తున్ దంద్రికం జెన్ నిజ। ప్రజపైఁదల్లికి మక్కువెక్కువని నాభావంబు కామేశ్వరీ!.

రాజశేఖరం.

మ॥ చలువల్ చిమ్ముడుచంద్రమండలములో జాబిల్లివెచ్చల్లు వెన్నెలలో వెన్నెలనాడు తెమ్మెరల నెంతేఁ దెమ్మెరల్ సోఁక నం చులఁదూగాడుకొలంకులన్ గొలకులన్ సొంపారు పద్మంబులన్! దిలకింతున్ నినుసీక్ష్ పారసము నో దేవీ! గిరీంద్రాత్మజా!

వెంకటశేషశాస్త్రి.

సభకు రాఁజాలని కవివరులు పంపిన పద్యములు.

మ॥ అవధానంబులొనర్చి దిగ్విజయ లాభాన్వీతులై మిమ్ము న త్కృవిదిగ్దంతుల స్వర్ణభూషణములన్ గైసేసి గంటల్ దగి ల్చి వెసన్ జేరిడి కొల్చి కద్బుధులోలిన్ మెచ్చునన్నారలీ యవనిన్ గల్గరుమిమ్ము వంటికవులయ్యా విూకుదీర్ఘాయువౌ

సీ॥ సంపూర్ణపూర్ణిమాచంద్రబింబము గేరు
వికసితాస్యంబులు వెలయుచుండ
జిలిబిలిమేలిగ్రొంజిగి గుల్కుచుండెడి
చిఱునవ్వువెన్నెలల్ చెలఁగుచుండఁ
దరుణారుణాబ్జపత్రను జైత్రిమగు మేలి

కనుఁగవసిరుల నొల్కంగఁజేయ
నామాటకామాట యమృతోపమానమై
వినువారివీనుల విందుసేయ
తే। గీ॥ బాలమన్మథులట్లు కుర్చీల నిలిచి
యఖిలసభ్యుల నిజకవితామృతాబ్ధి
నోలలాడించినట్టి మీ మేలు పొగడఁ
దరమె ఘనశేష రాజశేఖరుల కైన.

♦ ♦ ♦ ♦

మ॥ జనముల్ మెచ్చ శతావధానకవితాసామ్రాజ్యపట్టాభిషే
కనిరూఢిన్ గొలువున్న మీకు మఱికొన్కల్ గంటలున్ బే
రులి! చ్చినన్ దక్కువె కాని, యెట్లాపరితోషింపుండు,
కొండంత దే! వునిగొండంతటి పూలుపత్తిరిడుచున్ బూ
జింపఁగా సాధ్య మే?.

సీ॥ పిన్నవా రందులో విప్రులు మఱియును
మూఁడుభాషలెఱుంగు పురుషవరులు
దానికిఁదోడు కైతంబబ్బియుండె న
ద్దాని పైన శతావధాన మొదవెఁ
బ్రొద్దుటూర్గుత్తి జమ్ములమడు నెల్లూరు
పరిషత్తులను స్వర్ణపతకములను
సింహకంకణముగెల్చిన కవిసింహముల్
కడప భూషణములు కమ్రవిజయ
తే। గీ॥ ఘంటికలు బిరుదంబులు గనిన ఘనులు

చంద్రునకు నూలుపోగను సరణిఁ బంచ
రత్నముల నంపితిని కూర్మియలరఁ గొనుఁడి
యెపుడు మీమిత్రుఁడను రామకృష్ణకవిని.

ఇట్లు,
నేరెళ్ళపల్లె రామకృష్ణకవి.

వందనపూర్వకవిజ్ఞప్తి.

క॥ కనఁదెలిచెను దేవుఁడు కురి
సెను వర్షము హర్షదము కృషీవలుఁడనుగా
వున విత్తనములు చల్లెడు
పనికై నిలిచితి క్షమింపవలె రాలేమిన్.

తే। గీ॥ కడపపుంమున న్యాయాధికారు లెదుట
నిండు సభలోన నవధాన చండశక్తి
బుజువుపఱచి మీకు విజయమిచ్చినట్టి
తల్లి పరదేవతదయ కొత్తదియె మనకు?

శా॥ సారజ్ఞుల్ గల సత్సభాంతరముల న్సామగ్రి సంపన్నమై
పారస్యంబున లోటుపుట్టదు గదా పైపై యనన్ ధీరతా
శ్రీరాణన్ గయిదండయీయఁగ జయశ్రీవచ్చిమిత్రద్వయీ
మారాముల్లోకయింత లేక మిముసన్మానించుటల్ క్రొత్తలే.

తే। గీ॥ చేలలో విత్తనము వేయు బాలకవికిఁ
గంచుగంటల మోత యేగాని నేఁడు

కనకజయఘంట మ్రోయించు కవివృషభుల
కర్పుము పంచుకోఁజాలని సమయమయ్యె.

మ॥ వినుత శ్రీక సభానదుల్ కడపలో విద్యాధికుల్ మీకుఁ జే
సిన సన్మానము మండల ప్రజలలో శ్రేయస్కరంబైన వి
ద్యను బోషించుట ప్రోత్సహించుటలుగా నానందముం జెం
దివం! దనము ల్ మీకును మీకు బాలకవి యందఱ్ జేసి
నాఁడందురా.



ఇట్లు బుధజనవిధేయుఁడు,

| | |
|---|---|
| పర్లపాడు.<br>13-9-23. | కసిరెడ్డి వెంకటసుబ్బారెడ్డి.<br>బనగానపల్లె సంస్థానాస్థానకవి. |

వందనశతములు.

శా॥ అయ్యా! మిత్రమ! రాజశేఖరకవీ! యాహ్లాదకంబౌచు
మీ॥ నెయ్యంబొప్పెడి యుత్తరంబునిపుడే నేఁగాంచితిం
సంతసం! బయ్యెం వచ్చుటకింటిలో వసతిలేదయ్యెం జుమీ
నేటి రే! యొయ్యారంబుగ వ్రాసిపంపితి నిటే వోపద్యముల్
గొన్నిఁటిం.

మ॥ విలసచ్ఛ్రీకడపాఖ్యపత్తన మహావిద్వజ్జనోద్య త్సభా
స్థల యుష్మద్రచితావధానకవన శ్రావ్యార్థ సంతోషితో
జ్జ్వలదాతృత్వనిధానసత్ప్రభుబుధేట్ప్రాప్తార్థ భవ్యాంక ని
ర్మలభూషాదివిభూషితాత్మునినుఁ బ్రేమన్గాంచిహర్షించెదం

ఆ॥ వె॥ అమలరాజశేఖరాఖ్య యనర్థంబు
శేషశాస్త్రి యొక్క భూష నీకు
నంచితోన్నతకుల మంగీకృతార్యుఁడ
వయ్య! వేఱెపొగడ నవసరంబె?.

వసంతతిలక:-శ్రీరాజశేఖరకవే బుధలోకమిత్ర
మే చెన్ననామకకవే శ్శృణు పద్యమేతత్
శ్రీన్యాయమూర్తికవిశేఖర సత్సభాయై
సద్భక్తియుక్తమనసా ప్రణమామి నిత్యం.

వర్లపాడు. } చెమికెల చెన్నారెడ్డికవి.
13-9-1923. }

సమ్మాననసభలోఁ గవులు స్వయముగాఁ జదివిన పద్యములు.

కడప.

16-9-1923,

తే॥ గీ॥ రాజశేఖర సత్కవిరాజగేయ
సుయశ! వెంకటశేషార్య సూరివినుత
మీకుఁ గడపనివాసులు మేటికరుణ
నాశిషంబులు దెల్పెద లరసియరసి.

సీ॥ వయసుచిన్నదియయ్యుఁ బ్రజ్ఞహెచ్చుగనుండు
టబ్బురమౌనంచు నాదరించి
కాలమల్పంబైనఁ గడఁగిచెప్పినయట్లు
కైతయుండుటనెంతొ గౌరవించి
ప్రశ్నములెన్నైనఁ బ్రతివచనంబిచ్చు

తతి శ్రీమనోందమిఁదగఁదలంచి
కఠినసమస్యలఁ గాంచి శ్రీమం బొంద
కయె ప్రమోదమునొందఁ గలుగుటెంచి
తే॥ గీ॥ కవితయందొప్పు రసమును గారవించి
చారు హాటక ఘంటల సత్కరించి
మీకుఁ గవిసింహబిరుదంబు మేమొసంగి
నాము గైకొనరయ్య సంతసము మీఱ.

ఇట్లు,
కడపసభ్యులు.

సీ॥ శ్రీనత్సవక్షంబు చెలఁగిలోకులకెల్ల
నీప్సితార్థంబుల నీనుచుండఁ
గరుణారసాత్తవీక్షణములు యాచక
త్రిదశచింతాలత ద్రెంచి వైవ
ననస్పృశజైవాత్మ కాసక్తంబు భక్తాళి
హృత్తమోహరమయి యొసఁగుచుండ
నిర్జితపీయూష నియత వాగ్వైఖరి
మునిమనోవృత్తులఁ దనియఁజేయ
తే॥ గీ॥ వరదుఁడని సాధుసతిగాంచు సరసిజాక్షుఁ
డెలమి నీరాజశేఖరు సిద్ధకీర్తి
యుతుని వెంకటశేషార్య నొగిఁజిరాయు
రన్వితులఁజేసి కావుత మన్వహంబు.

క॥ ధరణిఁ గీష్పాదిచ్ఛే
త్పరాజయున్నెనెసు సాధుశ రితి యువుడు నూ
కరయుఁ సార్థకమై తగ
గురువులదౌర్కి యిది సుగుఁ గవులారా!.

సీ॥ సరసశబ్దంబుల జక్కనిరీతిని
చాసపాకంబున సాధుకవులు
సంతసంబంద నీశ్వరుకృపఁ గంటిరి
సరసకవుల్ నాగ క్షమఁ జెలంగి
తిరటంచుఁగొండాడ స్థిరకీర్తి జన్మదే
శంబునకుఁ బాతశాలకెల్ల
బంధుదేశికులకుఁ బరగంగ జేసితి
రిట్లనధానంబు లెల్లకాల
తే॥ గీ॥ మాంధ్రదేశంబుదిరిగి జేయంగఁగలుగు
శక్తి నొగ రాజశేఖర సాధు కీర్తి
యుక్త వెంకటశేషార్య! యురుముదమున
శ్రీపరాంబ యొసంగి రక్షించుఁగాత!.

జనమంచి శేషాద్రిశర్మ.

శా॥ విద్వాంసః ప్రతిభోత్థ సూక్తి నికరైః స్వర్గద్య పద్యాదికం
కుర్వాణాస్సదసద్వివేకవిభవా ద్రాగ్బోధయంత్యన్వహం
తాదృగ్గుచ్ఛశతావధాన కవితా ప్రాగల్భ్య దీక్షా భరే
కాలే వాంఛిత భావ సంఘటనతః కర్తా పరం దుర్లభః.

శా॥ యస్య ద్వేంకట శేష శాస్త్రిగదితం సత్పాద్య పాదం తుకాత్
త తీన్వార్యత్య హీ రాజశేఖర బుధో త్తంసేన సంపూర్యతే
నైతచ్చిత్ర మగాధిరాజ తనయా కారుణ్య కల్లోలినీ
పూలాలాలిత యోః ప్రశాంతమనసో ర్భేదావకాశః కుతః.

శా॥ యాగంగాధరయజ్వసత్ప్రభు సభాస్థానే బుధై ర్భాషితే
విద్వచ్ఛ్లాఘ్య శతావధాన రచనా ప్రాగల్భ్య మాభిభ్రతీ
వ్యాప్తైర్యదిశు యశోభరస్య జగృహే ఘంటామణిం ప్రోజ్జ్వ
లాం। సేయం శ్రీయుత రాజశేఖర కవే ర్జీయాద్వచశ్శ్రీ శ్చిరం.

శా॥ అన్నావఝ్ఝల వంశజ స్సురపురీ సంస్థాన కీర్తి స్ఫుర
చ్ఛ్రీమ త్కృష్ణనృపాల లాలిత మహాస్థానైక విద్వన్మణిః
శ్లాఘ్యాలంకృతి తంత్రచింతనపటు స్త్రయ్యంత నిష్ణాతధీః
సీతారామ సుధీశ్వరోఽలిఖ దిదం సాహిత్య రత్నాభిధః.

అ. సీతారామశాస్త్రి. 15-9-23.

శ్రీమత్పరదేవతాయైనమః

ఉ॥ అచ్చట నచ్చటం దిరిగి యద్భుత రీతి శతావధానముల్
హెచ్చుఁగ జేసి సత్సభల నెన్నికగన్న భవద్వచో విలా
సోచ్చయ మేమి చెప్ప నలువొందెడు శర్కరయుం సుధారసం
బచ్చున గ్రుచ్చి పెట్టినటు లద్దిర! తీయని ముద్దుపద్దెముల్.

ఉ॥ ఏచిన కమ్మవాసనల నెంతయు మీఁకవితా కుసూరి తాఁ
బూచిన పువ్వుఁబోలె రసపూర్ణత సొంపు జనింపఁ జేసె మీ

నోఁచిన నోముపంటయగు నూత్న వధానవిధాన చాతురిం
జూచినవారికెల్లఁగడుఁజోద్యమునన్ నతులన్ బొనర్పఁగన్.

మ॥ అవధానమ్ముల దత్తమండలములందారంభమున్ జేత నే
వ్యవధిన్ లేకయెపూర్తిసేయుటను నత్యంతాశుధాటీప్రచా
రవిధిన్ బ్రాభవమిక ప్రభాకలితులై రాజిల్లు చున్నట్టి మీ
కివెయర్పింతుముఘంటికల్ గొనుఁడీ యెంతేమోదముప్పొంగఁగన్.

తే॥ గీ॥ రాజశేఖర కవిచంద్ర! రమ్యకీర్తి
శేషకవిసింహ మెప్పుడుఁ జెంతనిలువ
నెల్లెడల సభలనుజేసి యీడులేని
యశము గొనఁజేయుఁగాళి మిమ్మనవరతము.

కడప.
16-9-1923.

బి. ఎల్. నరసింహారావు.
వకీలు.

శ్రీమత్పరదేవతాయై నమః.

♦ ♦ ♦

ఉ॥ ప్రాయముఁజూడఁ గొంచెమయి భాసిలుచున్నది కైతగాంచ నా! హా! యసమాన వైఖరిని హాయినిగల్గఁగఁ జేయుచున్నదీ! తోయజనూతివంశజుల తోరపునవ్యవధానశక్తి యింకేయెడఁజూడలే దిదియె యెన్నఁగనద్భుతమంచు నెంచెదన్

చ॥ సగనులు వహ్వరేయనుచు సన్నుతులం గరతాళసంజ్ఞలన్
విరివిగఁ జేసి మెచ్చికొన వెంకటశేష కవీంద్ర రాజశే

ఖఃకవిచంద్రులార! కడుఁగ్రమముగాఁగడపఁ డవధానముఁ
నిరుపను రీతిగా జరిపి నిర్మల కీర్తిని గొంటి రెంతయుఁ.

శా॥ హృద్యంబైన భవదవధానగరిమం బీక్షించి యీ దేహాళీ
విద్యావంతు లశేషసమ్ముదమునఁ వేనోళ్ల శ్లాఘించుచుఁ
బ్రద్యోతించెదు హేమకింకిణుల సంభావించి సత్పాండితీ
వేద్యంబౌ కవిసింహసద్బిరుదముఁ వేయిచ్చిరత్యున్నతిఁ.

తే॥ గీ॥ నవ్యకవితాప్రభావమే భవ్యమగుచు
దిశల నించుచునుండఁ ద్వద్యశము మీకు
జగ మెఱిఁగిన బావలకును జందెమేల
యనెడు నుడిరీతి బిరుదంబులవ్వియేల?.

తే॥ గీ॥ చంద్రునకు నూలుపోగన్న సామెతవలె
నిచ్చి నట్టి విభూషల నిచ్చు మెచ్చు
కొనుఁడు కొండంతశివునకుఁ గొండయంత
పత్తిగిని బెట్టువారేడ పట్టిచూడ?

ఇట్లు, పండితాఖండలపాదసేవకుఁడు.

కవిభూషణ, కావ్యతీర్థ జనమంచి వెంకటసుబ్రహ్మణ్యశర్మ,
ఆంధ్రపండితుఁడు, ము. హైస్కూలు కడప.

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

మ॥ అనరే మున్ను కవీశులెల్లఁ "గవితా యద్యస్తి రాజ్యేనకిం"
మ్మనువాక్యమ్మును, నేడుమీకదివశంబ య్యెఁ మహానంద

వా॥ క్షితి దేలెన్ బుధపాళి యెల్లెడ నుఁబర్వెన్ గీర్తి యింకింతక
న్నను వేఱొండుగలావె యీవసుమతిన్ రాజ్యాంగసౌఖ్యో
న్నతుల్,

మ॥ అవధానమ్మనియున్నచోఁ బసులకౌనా? కత్తిపైసాము యిం
దువిచారింపగణంబొకందు యతియున్ దోడ్తోసఁబ్రాసం
బు నిషిద్ధప్రశ్నంబులు కంఠపాఠములు మీరిన్నింటి లె
క్కింపకే యవధానంబురచించినారుగద మీయౌన్నత్య
మేమందునో?.

చ॥ సరస వచోవిలాసములఁ జక్కని శైలిని నాశుధారలో
జరపితి రయ్య మీరలు ప్రశస్తముగా నవధాన మింక స
ద్బిరుదము దత్తమండలికిఁ దెచ్చుచు వెంకటశేష రాజశే
ఖరకవులార! దైవకృపఁ గాంచుఁడిదీర్ఘవయోనియోగముల్

శ్లో॥ నందంతు విందంతు జనాః కవిత్వం
నిందంతువా తేన భయంనయాంతు
కుర్వంతు సర్వత్ర శతావధానం
దీవ్యంతు విద్వత్కవయో భవంతః.

ఉః చక్కని న్యాయవాది కవిచంద్రసుధీవర పౌరవార మిం
దిక్కడ మీవధాన విధమెన్నిక మున్నిడుకొన్న దాని నీ
ఫక్కిని దెల్పఁగాఁ గడప పౌరులు మీకవితాకుమారికిన్
జొక్కపు స్వర్ణ ఘంటికల జోడును బెట్టి యలంకరించి స

వ్యక్తియగౌరవించి యభిమానముగాఁ గవిసింహనామ
ముం! పెక్కుడుప్రేమతో బిరుదమిచ్చిరి సుకవులార!
యింక మీ! రక్కడనక్కడఁ సభలయందు నలంకృతు
లౌంగఁ జేయుచుఁ! దిక్కులుపిక్కటిల్లఁగ నతీవవితీర్ణ రఘు
ణంఘణంకృతుల్! పెక్కులునిక్కఁగాఁ గవిత లీలజరించె
దునట్లుచేసియు! చుక్కలతేనిఁ గేరు యశస్సుఁ దిలకంబుగఁ
బెట్టికట్టిగఁ! లెక్కడద త్తనుండలికి నిక్కపుమక్కువఁ జ
క్కఁ బెట్టిరే! తక్కువలేక యాంధ్రవినుధాకరముఁ స్థిర
ముండఁ జేయరే?.

ఇట్లు,
మద్దులపల్లె వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

కడపజిల్లా ప్రొద్దుటూరువాసులగు బ్రహ్మశ్రీ రాజశేఖర వెంకటశేషకవు లనుకవిద్వయంబు కడపనగరమునకు విజయముచేసి బ్ర॥ మ॥ పండితవరేణ్యులగు గంగాధరసోమయాజులవారి అధ్యక్షతతోఁ గూడిన అనేకవిద్వన్మణివరాలంకృతంబైన సభలో కవితాశతావధానమును సమీచీన విజయోత్కర్షముతో ఒనరించిరి. ఏకవింశతి పృచ్ఛకులచే ఇయ్యఁబడిన సమస్యలను అక్షరపదభావనిర్బంధములతో నియ్యబడిన సమస్యలను ఏకైకపాదముగా సరళశైలితోను భావపుష్టితోను పూర్తిచేసి సభ్యులకు పరమానందమును జనింపచేసి వారివల్ల అత్యంతమోదంబున నియ్యబడిన కవిసింహబిరుదముతోను సువర్ణవీరఘంటాభూషణములతోను సంభావితులైరి. అం

థ్రి దేశమునందు వీరు యెచ్చటకేతెంచినను వీరికిట్టి సన్మాన ములు జరుగునని నాయొక్క దృఢనమ్మకము. సర్వేశ్వరుఁడు వీరికి ఐశ్వర్యాయురారోగ్యంబులను ఇచ్చుగాక.

కడప.

ఇట్లు,

సోమంచి నీలకంఠం.

Subordinate Judge.

Cuddapah,

This is to certify that Brahmasri D. Rajasekharam Kavi-Simha is a satavadhani of a high order. He and his friend gave a performance at Cuddapah in September 1923 and it was graetly appreciated. Their style is easy and their ideas are grand. I hope that the twin poets will prosper wherever they go.

G. G Somayajulu.
Dist, Judge.

Cuddapah,

We feel it a pride to certify to the high talents of satavadhanees Brahmasri Rajasekhara Venkata Sesha Kavulu of Proddutur, more so because the former was one of us till recently as a member of the Judicial Establishment of our District.

They gave a performance of satavadhanam in this place on the 3rd instant to a large educated audience. The skill and the ease with which they completed the samasyas and delivered verses

extempore to the choice of the audience and especially their verses on the adventurous spirit of our Tamil brothers were highly appreciated.

Though he had left the department we still consider Rajasekhara kavi as one of us and anything more said in praise of him and his colleague will be praising our ownselves. We wish our two brothers all success in their new sphere of activity. May god bless then with long life and presperity.

V. Prakasam,
Sheristadar.
B. Srinivasa Chari,
Head Clerk.
S. Narayana Rao
Translato]
R. Subba Rao
Record keeper.
K. Varada Chari
Head clerk, Sub Court, 16-9-23.

కృతజ్ఞతా ప్రకటనము

మ॥ ఒకమాఱేనియు నిన్నుఁగొల్చిననరుండొందుఁ నిమేషం
బునం! దాఁకవేపద్దెముల్లుశక్తియున నోహోతల్లి! నీపుత్రుల
ట్లకలంకస్థిరభక్తితోఁగొలుచు మా కంపంగరాదే కదుఁ
నుకరంబై విలసిల్లు సత్కవన మంజుస్ఫార వైశద్యముల్?

తే॥గీ॥ భవదుదార సుముఖ మనోబల తరంగ
మాలికలుపంపి జయలక్ష్మి మమువరింపఁ

జేసితిరిగాక మిమ్ము రంజింప నెంత
వారమేమాదు మోకడ్వ పౌరులార!

తే॥గీ॥ చిఱునగవు లుల్లసిల వికసిత ముఖార
విందములఁ గూర్చుచున్న మీయందఱఁగను
నపుడు కొండంతటి సమస్యలైనఁ గాని
బెండువడిపోవె విద్వత్ప్రకాండులార!

మ॥ చిఱుగంటల్గల స్వర్ణభూషలను మాచేఁదోయికందిచ్చి
యుబ్బురమందఁగ గవిసింహనామబిరుదంబుఁ గూర్చి
యీయాకవీశ్వరులఁ జేసు ప్రతిష్ఠనిల్పితిరి మీసద్భావ
ముఁ గొంకరీ కరుణాసారము లిట్టివంచుఁబలుకంగా నేస్త
మే యుత్తఱ్ఱు.

సీ॥ నాకనుభవము సుంతయు లేని యవధాన
మే యితఁడిటుపూనెనే యటంచుఁ
దొలిపద్ద మింతటి గళరావమునఁ జెప్పె
నే పైన సుతినిల్పునే యటంచు
నిరువదియొక్కరు పృచ్ఛకుల్ తవిలిరే
యుత్తరం బెటులిచ్చునో యటంచు
నవధానమయ్యెఁ బై నన్నివృత్తముల లో
టింతలేకయె చెప్పునే యటంచు

తే॥గీ॥ సభను నే నిల్చినంత వాత్సల్య తరళ
చిత్తమున నాజయము శంకచేయు మృదుల

సరళహృదయుండు గురుఁడునౌ సాక్షరన్వ
యాంబునిధిచంద్రు సర్వోత్తమార్యుఁ దలఁతు.

తే॥గీ॥ ద్రోణువెన్కఁ గృపాచార్యు రాణ మెఱసి
గురుఁడు దాసార్యుఁడీడువిద్దె మెఱుఁగుపెట్టి
మన్ననలఁ జూఱు మా జనమంచి వంశ
సాగరేందుని శేషాద్రిశర్మఁ దలఁతు.

గీ॥ రాజ కీరము లేని యారామ మట్లు
చందురుఁడు లేని నిశవోలె జ్ఞానధనులు
వరగుణులు నేఁటిసభను గ్రిక్కిఱిసియున్నఁ
గొఱఁత చనదు దాసాచార్య గురుఁడు లేమి.

సీ॥ తల్లిని దండ్రిని దైవంబు మించునో
పరమపావన! పరబ్రహ్మమూర్తి
యఖిలైకపూజ్య దాసాచార్యవర్య నీ
దివ్యాంఘ్రియుగళమే దిక్కు నాకు
చిననాఁడు నీసేవచేఁ గొన్న యక్షరం
బులె నేఁడు సత్సభాపూజ్యతఁ గనె
నీవుండగానె శతావధాన మొనర్చి
జయలక్ష్మితో నమస్కారమిచ్చు

తే॥గీ॥ భాగ్యము లభింపదయ్యె నో పరమపురుష!
నీదు దాసాను దాసుఁడ నిండుకూర్మి
వేయిహస్తంబులన్ గప్పి వేయికనుల
నరసి వేయి దీవనలను గురియవయ్య.

ఉ॥ భారత దేశ మందుఁ గవివర్యులు లోకులఁ దన్ప నర్హస
త్కారముగల్గ సందియముదార్ఢ్యాన దంచనిరూఢిసేయబం
గారపు బొడ్డుగంటల నిగారపు సొమ్ముల నిచ్చి పెద్దవా
పేరుల నిచ్చి మాయశము వెల్లడి చేసిరి కడ్పకోవిదుల్.

మ॥ అలరున్ గంటలు వ్రేలుభూషణము! యీయాంధ్రక్షమా
మండలిన్। గల యీయాసభ నేను శేషకవియున్ గైతల్
దగన్ బల్కన్ ని॥ చ్చలువహాస్తములన్ ఝణంఝణఝ
ణం ఝాణంఝణా మోఘుని। స్తులనాదంబులుగుల్కన్ స
భ్యులను సంతోషాబ్ధిలోఁ దేల్పుమా!

మ॥ వినుమా వెంకటశేషసత్కవి। మణిద్వీపంబుఁ దానెప్డు పా।
యునొనెం దేనవధానమున్ సలుపనుద్యోగించి యీ యు
న్నతా। సనమున్ జేరినమాత్రఁ గన్నులకు సాక్షాత్కార
మై తోఁచునా। జననీరత్నముకూర్మి యెంతనివచించన్ నే
నోతమ్ముఁడా!

సీ॥ వైజయంతముఁ గేరి వైభవంబులమీఱు
ధనికుల హర్మ్యసంతతులతోడఁ
జాల్వోసి యెత్తంగవచ్చునంచనెసు
చక్కని రాజమార్గవర్గములతోడ
మండలంబునవారి మంచిచెడ్డలరయు
నధికారి కార్యగేహములతోడ
ధనహేమవస్తువాహనములు తనివోవఁ

ప్రబలు నిర్వాదివేల ప్రజలతోడఁ

తే।గీ॥ కమలవనమందు లక్ష్మినాఁ గడపపురము
కళలఁగులికెడి నీమెప్పిఁ గనికరమున
మండలమునిల్పి మన్నన మనుపవమ్మ
సంతసము గూర్పవమ్మ! యీశ్వరునికొమ్మ!

సీ॥ ధన్యులౌ విష్ణువర్ధన నన్నయలనాఁడు
కృతకృత్యమగు రాణ్మహేంద్రవరము
తిక్కన మనుమసిద్ధి మహానుభావులనాఁడు
శ్రీమించు విక్రమసింహపురము
శ్రీనాథ వేమధాత్రీనాయకులనాఁడ
ఖండకీర్తిని గన్న కొండవీఁడు
నలసానిసుకవి రాయలనాఁడు తనపేరు
ధరయెల్ల మ్రోగు విద్యానగరము

తే।గీ॥ తలఁపు గొలిపెడు మాకవిత్వమునకలరి
సలుపు కవిపూజ యాంధ్రభాషామతల్లి
పూజగా నెంతు ధన్యవై పొదలవమ్మ
కడప నగరమ్మ! చల్లని కడుపుతోడ॥

ఉ॥ రానిది రాదు వచ్చినది రాకనుపో దిదె యున్నవిద్దెకుఁ
నీ నెన హూఁతగాఁగొని యనేకసభల్ జరియించి విజ్ఞులౌ
ధీనిధులన్ గణించి యొక తీరునఁ గీర్తి గడించి నారమి
ట్లే నిరతంబునున్ జరగనిచ్చి మమున్ గురుణింపుశాంకరీ!

సీ॥ అందఱ నిటఁ జేర్చి యవధానసభ నేఁడు
విజయమొందఁగఁ జేయు పెద్దలకును
బ్రశ్నంబులిచ్చి మాప్రతిభాతిశయమును
వెల్లడిపఱచిన పృచ్ఛకులకుఁ
బిలిచినంతనె వచ్చి వికసితాస్యములతో
నెదుటఁగన్పించిన ప్రేక్షకులకు
మమువీఱువారయ్య మననుమంచిదగుటఁ
బద్యంబులోనఁ గీన పండితులకు
తే॥ గీ॥ నున్నతపదాననుండు నుద్యోగులకును
గోల రొనరింపకుండిన కక్షులకును
వారు వీరన కిందున్న వారలకుఁ గృ
తజ్ఞతను బంచియిత్తు మిత్తఱిని మేము.

రాజశేఖరం.

శా॥ లోకాలోక పరీత భూ భరము నీలో నుండెనో లేక నీ
వేకన్పింతువొ సర్వమై, సభలయందెందుఁ గనఁ జేతునీ
యేకాకారతమాకు, నీబిరుదులీయీనత్కృతుల్ సన్నుతుల్
నీకారుణ్యము గాకయుండునె భవానీ! భక్తచింతామణీ!.

శా॥ ధన్యంబయ్యెను మాపరిశ్రమములుఁ దాతౌయణీదాస
తా! విన్యాసంబు శతావధానరతియుఁ విద్వన్మహారాజ
మూ! ర్ధన్యాలంకృత దేహాళీపురసభాదత్తోరుసౌవర్ణ సూ
త్రన్యంచ జ్జయఘంటికా కలిత హస్త ప్రస్తుతశ్రీకమై.

మ॥ నలువౌఁకొండల కోట గు త్రిపురి దానఁ జేర నీసింగపుఁ
వలయంబుల్ సుకరాళ వక్త్రములు శుంభద్వీర గర్జారవం
బులుగా నీజయఘంటికాకలరవంబుల్ గూర్చితో కడ్పమం
డలమా! నీకృతిసార్థకంబు పువుదోఁటన్ బోలె వర్ధిల్లుమా!.

మ॥ కవిరాజుల్ విబుధుల్ మహామహులు పెక్కండ్రున్న విద్వ
త్సభన్! గవితాస్ఫూర్తి వధానముల్ సలిపి నెగ్గన్ సాధ్య
మేమేటి గా! రవమొప్పన్ జయఘంటికల్ బిరుదులర్పిం
బంచు మాకిచ్చుచో! భవదౌదార్యము శాంకరీకృపయు
విశ్వస్తుత్యమై యొప్పెశీన్ .

సీ॥ పసిరెత్తుచుండిన సస్యపుంబిశికిళ్ళ
నింగిఁజూచెడు కాపు నెగులుమాన్చి
నీటికై మేటిపోరాట మందెడువారి
కక్కుర్తినెల్ల గట్టెక్కఁజేసి
గాలికాకలకు నుక్కకుఁ దల్లడిలువారి
తనుమనస్తాపముల్ తగ్గఁజేసి
నిప్పుటెండఁజరించు నిరుపేదబాటసా
రులపాలి దైవమై యలఁతశించి

తే॥ గీ॥ వర్షదానంబు క్రొత్తజీవనము గూర్చి
కడపఁ బాలించితివిగాని కదలుచుండెఁ
గడుపులో మండలముదీయఁగలుగు చింత
దీని మాయింపు హైమవతీ! మదంబ!

శా॥ ఏవో నాలుగుముక్కలల్లఁగల మమ్మీనాఁ డెల్లలెక్కించి యే
దే వాణీన్నను దేసపోనల వరఁ దీయంబు గావించి నీ
వే వాగర్థ రసాత్మకత్వమున నావిర్భావముఁ జెంది మా
కీ విఖ్యాతి గడించి తెచ్చెదవుతల్లీ! యెంతకారుణ్యమో!

శా॥ అమ్మా! నీవెయొసంగకున్నఁగల భాగ్యంబేది మాకింకస
ర్వమ్మున్ నీవిడినట్టి భిక్షయె సిరుల్ వాంఛింప మీరీతిఁ గా
లమ్ముఁ బుచ్చుచుఁగావ్యరత్నములలీలన్ నిన్నుఁ బూజించిచొ
క్కమ్మా నీపదభక్తి రక్తిని మనంగాఁ జేయు కామేశ్వరీ.

మ॥ వరగోత్రోద్భవముఁ మహోన్నతకళాప్రాచుర్యగాంభీర్యభా
స్వరముఁ దుష్టవిసత్వసంహరణ శుంభద్వీర గర్జారవో
ద్ధురముఁ రాజసతేజముఁ విజయతాధుర్యంబునో రాజశే
ఖరసింహంబు నుతింపనొప్పు జనలోక శ్రేష్ఠ సంచారమై.

వెంకటశేషశాస్త్రి.

ఈనెల 3వ తేది కృష్ణజయంతినాఁడు కడపలో శతావ
ధానము జరిగినది. బ్ర॥ రాజశేఖర వెంకటశేషకవులిరువురును
శతావధానమున సభ్యుల హృదయము లానందాంబుధి నోల
లాడించిరి. కఠినసమస్యలకుఁ జమత్కారముగా సమాధాన
మొసంగిరి. అత్యల్పకాలమున నవధానము ముగిసినది. ఆస
భకు మ॥ గొల్లకోట గంగాధర సోమయాజులు యం.ఏ.బి.యల్
జిల్లాజడ్జిగా రగ్రాసనాధిపత్యము వహించిరి. అవధానికవుల
నన్మానించుటకు ఈనెల 16 తేది ఆదివారము సాయంకాలము

సభ జరపఁబడినది. శ్రీయుత సోమయాజులుగారే యధ్యక్షపదవి నలంకరించిరి. కవులకిరువురకును స్వర్ణసూత్రయుతములుగా ఘంటల బహుమతినొసంగిరి. పండితులు పెక్కుమంది సభ నలంకరించిరి. ఈకవిసింహబిరుదము వీరికిఁ దగినదేయని యామోదించిరి. పలువురు పద్యములు చదివిరి. అగ్రాసనాధిపతిగారికి వందనములతో సభ ముగిసినది. (ఆంధ్రపత్రిక.)

---

The public are already aware that efforts are being made to suitably reward the high literary attainments of two young men of Proddutur Rajasekharakavi and Venkataseshakavi.

A largely attended public meeting was held in the Theosophical hall Cuddapah on the 16th instant. Among those present on the occasion were Janamanchi Seshadri Sarma garu Kavyathirtha and author of Brahmandapurana, Venkata Subramanya sarma garu Kavyathirtha and Kavi Bhushana, Rayapeddi Sesha Sastri garu a Tarkika of Palugurallapalli Badvel Taluk, A. Sitaramasastri garu Sahitya-ratna and state poet Surapuram, estate, Nizam's Dominions, Sundareswara Sastri garu Siromani, Sanskrit Pandit Local High School, Maddulapalli Venkata Subramanya Sarma of Nellore, K. Varadacharlu formerly sanskrit Pandit of the Local High School, and B. L. Narasimha Rao poet and deciple of the famous Tirupati Venka-

teswara kavulu of Circars fame. Among the local gentry that attended the meeting, may be mentioned K. Gundurow garu B. A. B. L. High Court Vakil, S. Nilakantam Pantulu B. A. B. L. Subordinate Judge, B. P. Devarajulu Naidu B. A. B. L. H. C. Vakil, Public Prosecutor, G. Pleader and M. L. C., C. Narasimhacharlu B. A. B. L. High Court Vakil, K. Ragunatha Charya B. A. Pleader and A. Nanjundappa garu B. A. B. L. Pleader and others. Letters of sympathy and regret for absence were read in poetry. These letters were sent by Nerellapalli Ramakrishna kavi, C. Chongalraya Sastri, Balakavi Venkata Subba Reddi and C. Chenna Reddi.

M. R. Ry. G. Gangadhara Somayajulu garu M. A. B. L. District and Sessions Judge presided over the meeting. The President in opening the proceedings appreciated the high talents of the young poets sitting by his side and declared that the object of the meeting was to honour them. It was unanimously decided by all assembled that that gold chains with bells should be given to the poets and that the title of Kavi-simha should be conferred upon them. The chains with bells were accordingly given and the title conferred amid loud cheers and acclamations.

The poets replied thanking the citizens of Cuddapah for having done a great honor to them.

Swarajya 21-9-23.



## 13-2-1926 తేది నుయ్యాలవాడలో జరిగిన యవధానము.



ఉ॥ చీమయు నాదిగాఁగ సరసీజరుహాండము దాఁక సర్వముౕ
నీ మహనీయ శక్తి మెయి నిల్చెడి నీకృపఁ గన్నవారి కీ
భూమియుఁ బూలదండయు సముద్రములన్నియునీటిబిందు
వు౹ లీన్నమహి మాతిరేకమునిలింపులుసైతమెఱుంగరంబరో!

రాజశేఖరం.

శా॥ చుక్కల్ గుంపులుచంద్రుఁడొకఁడు తేజోలీలవేయంతలీ
ఫక్కిౕజేయుటయేమి! యన్నిఁట సమత్వంబుంట మాత్ర
త్వన౹ మ్యక్కర్తృత్వము, కాళిదాసువిహితుండా? శత్రు
లా యన్యలీ౹ చిక్కల్ బ్రహ్మయొనీవెతీర్చెదవొనీచిత్తం
బు కామేశ్వరీ!,

వెంకటశేషశాస్త్రి.

### అవధానము.

1. సీతారఘురామునిగూర్చి ఉత్పలమాల.

ఉ॥ శ్రీరవివంశ వారినిధి శీత మయూఖుఁడు దుష్ట దైత్య సం
హార విహారుఁ డార్తజన తార్తి నివారణ దక్షుఁడిందిరా
సారస నేత్రతో భువన జాలముఁ బ్రోవఁగఁ బుట్టి నట్టి సీ
తారఘురాముఁడిచ్చునిరతంబుశుభంబులుమీకుఁగూర్మిమై

2. సమస్య.

క॥ విద్రాజిదమన జననీ! సు
రేడ్రత్నముఁగావ దుష్టు లీనీసుత స
మాద్రాజిఁ దునుమ హరి యట
(గొడ్రాలికిఁ గొడుకు పుట్టెఁ గోడండ్రేడ్వన్.)

3. సమస్య.

శా॥ ఆత్మార్థంబది యెట్టిదో యెఱుఁగలే కత్యంతముం గష్టదు
ష్టాత్మ శ్రేణిని గూడి నీతివిడి నిత్యంబున్ సురాపాన మ
త్తాత్ముండై భువిదొర్లిమైమఱచియన్యంబౌగతిన్ బోయున
య్యాత్మానాత్మవివేకశూన్యున కపూర్వానందమే కల్గెన్

4. సమస్య.

చ॥ దృఢతర భావనాబల సమేధిత వాగ్వ్యవహార సంపద
న్ద్రిఢిమముగల్గు ప్రశ్నలఁ దృణంబుగఁ ద్రుంచువధానలీలనా
దిఘులి మహానుభావుఁ డదితిప్రజఁ బ్రోవ రణాంగణంబునన్
(దృఢతరచక్రధార వను దేవకుమారుఁడు దున్నె దైత్యులన్)

5. సమస్య.

ఉ॥ ముమ్మరమైన కోపము సముద్ధతిఁ జూపుచు నతిప్రఘ్నశా
లమ్మెఱయించు మానినియబలామణి రాహువుచేరి 'పాప నే
డమ్మ' యనంగ 'లేఁడ' నఁగనొదలనూపుచువాఁడుపల్కెనో
(కొమ్మ పయంటలోపలను గోకనదాప్తుఁడు క్రీడసల్పెఁడే?)

6. సమస్య.

చ॥ నిరతముడాగిలోగికడునేర్పుమెయిఁ జరియించుచుఁ రుపా
భరమునవెక్కిరించెడు సపత్నశ్రుణంబును గాంచి కోపియై
దురుసగుదొంతికుండలకుదొంగను నాజ్యఘటీమహాహిరా
(డ్గరుడునిఁ ద్రుంగెనొక్కభుజగంబువరాక్రమమేర్పడఁ సఖా!)

7. సమస్య.

పురాణశాస్త్రికను పంక్తి రక్షరే
త దర్థవ ద్వర్ణచయంచ శబ్దః
తత్సంస్కృతి స్తే వదనే తతః పతం
(జలే విలోలం త్వయి శబ్దజాలం.)

8. మామను ప్రతిపాదాదిని రావలెను. కందము. భారతప
క్షమున.

క॥ మామ ముదంబును గడుఁగను
మా మను యుద్ధమునఁగావుమా నిను విడలే
మా మను నీశతమును సరి
మామ ముదలఁజూడ వలదు మాపార్థనపై.

9. వివాహగృహము నందలి వేపఁచెట్టును గుఱించి.

ఉ॥ తావకజాతి వృక్షములు ధారిణిసెల్లెడ నుండుఁగాన నెం
తే వినుతింపఁగాఁదగవు నిక్కము నీస్థితి యట్లుగాదు మా

బావయు నీదువర్ణనము ప్రెసిడెం బెండిలియింటిలోని యో
పావన నింబవృక్షమ! భవత్కృత పుణ్యమదెట్టిదో కదా?

10. ప్రస్తుత రాజకీయపరిస్థితులు సీసము.

సీ॥ సన్యాసమందిన శక్రసూనునిభాతి
గాంధి శస్త్రాస్త్రముల్ గడనువైవ
జలములందలి కప్ప తలసూపు చందాన
నానీబెసెం టప్పుడపుడు రాగ
నెన్నిసార్లడిగిన నిది యసమయమంచు
నరవిందయోగి నిద్రాప్తినుండ
నారేండ్లకడచె మాయధికారమేమానొ
యనుచు జస్టిసువార లడలుచుండ

తే॥గీ॥ మోతిలాల్ స్వరాజ్యప తాకమును నిలువఁగ
రాజకీయపక్షములెల్లఁ ద్రాసులోని
కప్పలటులుండ నందఱఁ గన్నొఱంగి
తెల్లదొర లేలుచున్నారు చల్లగాను.

11. నీటిబండి.

ఉ॥ నీరములేక లోకములు నిల్వవటంచని లోనెఱింగి యా
నీరముదెచ్చి శాంతిగొని నిల్చితివచ్చటఁ బెండ్లియింటికిన్
దూరమునందుఁగాడిఘరతోఁ జెలిమిన్ బొనరింప, లోకమం
దారమ! నీళ్ళబండి! కడుధన్యవు, మోదముగల్గె నిన్గనన్.

12. ఇన్స్పెక్టరుగారి బెత్తమునుగురించి గీతము

తే॥గీ॥ దశవిధగుణంబు లలరు నీదండములకు
నైన నీయినస్పెక్టరు హస్త మందుఁ
బొలుపు లొలికించెడి షికారు పోవునపుడు
భయము గలిగించు దొంగలఁ బట్టునపుడు

13. పలుమారులు లారిపోవుచున్న గ్యాసులైటునుగూర్చిగీతము.

తే। గీ॥ ఆరొరాబొరియాలీసు లట్టు దోప్పి
క్షణము గనుపించి క్షణమునఁ జాటునొందె
నవల నొకక్షాంతసేపటి కారిపోక
నీటుమెయి వెల్గె నీగ్యాసులైటు నేఁడు.

14. అర్ధనారీశ్వరవర్ణనము. వసంతతిలక.

శ్లో॥ సద్యోవిలోలతర దక్షిణదృక్ప్రసార
సంకోచవల్లిత వామతరాక్షిపాతం
ప్రేమప్రపూర్ణహృనయం పితరం త్రిలోక్యాః
తన్నౌమి స్వార్థపురుషప్రకృతి స్వరూపం.

15 బుడ్డా వెంగళరెడ్డిగారున్న ఉయ్యాలవాడనుగూర్చిసీసము.

సీ॥ శిబిసార్వభౌముని చే యశోభరితమై
యలరారె మున్న యోధ్యాపురంబు
రామదాసనెడు ధర్మస్వరూపునిచేత
నలరారె మున్ను భద్రాచలంబు
నవల మీరాబాయి యనుభక్తురాలిచే
నురుకీర్తిఁ గనియెఁ జిత్తూరుపురము

పరమభాగవతుఁడై పరగు సజ్జనులచే
రహిఁగీర్తిగనెఁ బాండురంగపురము
తే॥గీ॥ నల్లి వెంగళరెడ్డిచే యశము నొందెఁ
గందనూల్ మండలములోని గ్రామములకు
నన్నిఁటికిఁ జల్వనీడ క్షీరాబ్ధి సుతకు
ననుఁగు మగరాలమేడ యయ్యాగ్యలవాడ.

16. ఏకసంథ

క॥ నావలనఁ గొదవలేదిక
దేవరకును విన్నవించితిని నీచిత్తం
బీవిధమున రాకున్న ధ
రావరసుత! మీరెఱుంగరా? సర్వజ్ఞుల్!

అవధానాంతమునఁ గవులు చదివిన పద్యములు.

మ॥ కవిలోకైకసుపూజ్యులార! సమలంకారాన్వితంబై మహా
జనధారా మిళితంబునై సరసమై సత్పండితామోదమై
సువిశుద్ధంబయి పద్యరత్నములచే శోభిల్లి యుచ్చోటమీ
యవధానంబుసమస్త సభ్యులకు నాహ్లాదమ్ముఁ జేకూర్చెఁగా

శా॥ నానా యుద్ధకలాసమంచిత విధాన ప్రాజ్ఞ సత్కీర్తిమ
త్సేనానీకృతకాలసూచనలఁ దత్సేనల్ వడిఁ బ్యూహసం
తానంబైనవిధంబునన్ గడుభవత్సంకల్పమాత్రమ్ముడుల్
వైనంబొప్పఁగఁగూడెఁ బద్యతతిగా భావార్థసంపత్తితో.

ఉ॥ మానిత సత్కవీంద్ర బుధమండనులార! శతావధాని పం

చాననమాసద్బిరుద మందఱు సభ్యులు నీసభాస్థలిన్
మానుగ మీకొసంగి రసమానకవిత్వ కలావిశారదుల్
గాన జగాన మీకెదగుగా బిరుదంబు పరిగ్రహింపుఁడీ!

ఉ॥ మీ కవితాసతీమణు లమేయ గభీర గుణాభిరామలై
లోకులమోహవారినిధిలోఁ బడవేయుచు దుర్మనంబునన్
దాఁకఁగ నెంచు కాకవిజనప్రతతిన్ విదలించి కీర్తులన్
జేకొనిరయ్య ప్రాక్సుకృతసిద్ధిలభించెను గాదె మీకిలన్.

పాణ్యం లక్ష్మీనృసింహశాస్త్రి.

తే॥గీ॥ మీ కవిత్వ బలంబు నమేయ బుద్ధి
బలము ధారణాబలము విశ్వప్రశస్త
మనుచు మునువింటి నీనాఁడు కనులఁగంటిఁ
గంటిమోదము కవిరాజు లంటిమిమ్ము.

పా. సుబ్బరామయ్య.

శ్రీపరదేవతాయైనమః

చ॥ ఒకచరణంబునొక్కరు మఱొక్కటియొక్కరు చెప్పుచున్ సమ
స్తకవుల మానసంబులకు సంతసమున్ గలిగించు శేషయా
ఖ్యకవి సుకాళహస్తికవి! యద్దిర మీరొనరించి నట్టి యా
శుకవనమున్ వధానమునుఁ జూడఁగ మాకొదవెన్ మహా
ముదం! బు కవివతంసులార! మిముఁబోలుకవీంద్రులమున్నె
ఱుంగనాం! ధ్రకవులలోన మీరలు నిరంతర కీర్తిగడించినా

రు చం॥ పకపదపూర్వమాలికను భక్తిమెయిఁ దమ కిచ్చు
చుంటిఁ బా। లకుఁడను నాయెడఁ సుకవులార! సదా దయ
యుంచఁగాఁదగుఁ.

ఉయ్యాలవాడ.
28-2-1926

ఇట్లు,
గొ. సుందరరామశాస్త్రి.

మాయూర శ్రీయుత గట్టుపల్లి వెంకటనరసయ్యగారు తమ గృహమున వివాహకాలమున విఖ్యాత శతావధానులును గవిసింహ బిరుదాంకితులునగు బ్రహ్మశ్రీ రాజశేఖర వెంకటశేషకవులను రప్పించి శతావధానము చేయించిరి. గొప్పవిద్వత్సభ సమావేశమయ్యెను. ప్రశ్నలన్నియుఁ బ్రత్యేకశ్రద్ధతో నతికఠినములుగ నేర్పఱుపఁ బడియుండెను. కవిసింహులసాధారణ ధారణాధోరణులతో నన్నింటి నెదుర్కొని సముచితరసోల్లసిత విధమునఁ గవనము చెప్పిరి.

అవధానాంతమున నీకవివతంసులకు స్వర్ణపతకములు, విద్వద్బృందము "అవధానిపంచానన" బిరుదము నొసంగి సత్కరించిరి. ఇట్టి విద్వత్కవులు దత్తమండలముల నలంకరించియుండుట మా భాగ్యవిశేషము.

ఆంధ్రపత్రిక.
16-3-1926

భోభో స్తోత్రభవంతో! భవానీకృపానీత సరసకవితామృతాప్యాయిత పండితాఖండలమండలీమండిత సదస్సహా

ప్రౌ! సహస్రముఖోద్గీత శతవధానవిధానధురీణతా సమాసాది
తామల యశశ్చంద్రికా ధవళితాశావకాశౌ! శ్రీమద్విద్వత్కవి
కవిసింహ శతావధానీత్యాది బిరుదాంకితౌ! నిరంకుశప్రతిభాధు
రంధరౌ! బ్రహ్మశ్రీ రాజశేఖరవెంకటశేషశాస్త్రిణౌ! యుష్మ
త్ప్రదర్శిత శతావధానవిధానావలోకన సంజాతకుతూహలా
వయం మత్రకించిద్విజ్ఞప్తుముత్సహామహే ఉయ్యాలవాడపురపం
డితసదస్యాః కింనామ నావలోకితా స్తత్ర తత్ర బహవో బహు
శో బహుభిః ప్రదర్శితా శ్శతావధానసభాః? అహో మహదంత
ర మ స్త్యేవేతి కిమువక్తవ్య మేతదుభయజ్ఞానాం తద్జ్ఞానాం.
కైవషా. కనీపాకచ్చేయ మసాధారణాధారణా. మృదులపదగా
మునీ లలితరసశాలినీ కవితావిలాసినీచేయ మనన్యాదృశీ. మో
హినన్యవరావతారాఇమా జగదాహ్లాదనే భువనసమ్మోహనేచ.
సదస్యోక్తా స్సుకుసాస్యక కిముసమన్యాః? వజ్రఖండా అహోస్వి
దయఃపిండాగ. లీలయైవ తృణీకృతా స్తా ఇత్యహో మహదా
శ్చర్యం. సారస్వతే చిత్రకళాప్రదర్శన మిత్యేత దపర్యాప్త మి
ద మైంద్రజాలికమపిచ సమ్మోహనాస్త్రపాతః. భవదవధానా
వలోకన ప్రేరితా స్సమ్మోదితావయ 'మవధానిపంచాననే'తి
బిరుదాంకన ముపాయనీకర్తు మేకగ్రీవమంగీకృత్య వస్సమర్ప
యామ స్సఫలీకరో్మ్యఽస్మ ద్విధేయతావిధానం. తత్ర త్ప్రఖ్యా
తపురీ పండితసదస్య సమర్పిత సువర్ణకంకణ జయఘంటికావి
భూషణ కవిసింహేత్యాది బిరుదావళీ విరాజితానాం భవతా
మిదముపాయన మననుగుణ మపర్యాప్తము పాదరమేదుర
హృదయా అనుగృహ్ణాంత్వితి విజ్ఞాపయామః.

ఇతి విద్వత్సదస్యాః.

## 20-4-1926 కమలాపురము తాలూకు దాదిరెడ్డిపల్లెలో నొనరించిన శతావధానము.



మ॥ అవధానంబొనరించు కార్యమననీయత్యంతకారుణ్యవై
భవమొప్పరుట నీళ్లుదాల్చినగతిఁ భాసిల్లునీగత్స్వభ
గవిలోకంబులు శీర్షమూపుచుమహానందంబునొందఁగఁ జేఁ
డవధానంబును సాగఁజేయఁగదవమ్మా! శైలరాజాత్మజా!

రాజశేఖరం

మ॥ చనుఁద్రావంగలబిడ్డఁడమ్మయనఁగా సంస్కారముల్ నేర్చి
పా! లును బువ్వఁదినుపించునాఁడు చిఱుపల్కుల్ నేర్చి
కాంతాధరం! బునఁదేనెల్ జవిచూచుచో నుకవితాపూర
మ్ములఁ లోకమో! హానుఁడై సత్కవిఁజేయునీకృప దుస్సహ
హ్యాంబెందుఁ గామేశ్వరీ!

జి. వెంకటశేషశాస్త్రి.

1. పొట్టిభర్త బొడుగుభార్య సంసారము సీసము.

సీ॥ ముద్దాడఁగామూతిమూతియొద్దకుఁజేర్పఁ
వనితధనువుభంగి వంగుచుండఁ
జెలితోడమంతనంబులుసేయుచోమగం
డెంతయుఁగోతినాఁ నెగురుచుండఁ
దరుణి హిడింబయాతండు వామనుఁడంచు
బంధులెల్లను గేలిపఱచుచుండఁ
సతిచెంతఁబతినిల్వ నితఁడుకుమారుఁడో

మసమఁడో కొ్రయంచు జనులునవ్వ
తే॥గీ॥ నొకరినొక్రరుచూడఁగోరికయుబొడమఁ
దారకాపథ మొకరు పాతాళ మొకరు
చూచుచుండఁగఁ బొడగై నసుదతిదాని
పొట్టిమగఁడు కాపురమును బూనియుండ్రు

2. అగ్రహారమును గుఱించి సీసము.

సీ॥ ఏపురంబునఘనుం డా పుష్పగిరిని సం
స్థానపీఠాధిపత్యము వహించె
నేపురంబున విప్రు లెల్లను శ్రోత్రియ
గ్రామములనఁగ విఖ్యాతి గాంత్రు
కవిలోకమౌళి వెంకటశేషశాస్త్రి యే
పురిఁ దొల్లి నవధానమును రచించె
నాటలచే మంచితోటలచే నేది
యుదకమండలకీర్తి నొందుచుండుఁ
తే॥గీ॥ గడపమండలమందలి గ్రామములకుఁ
దల్లి భూసతీమణికి ముత్యాలజల్లి
కలితబహుళార్థిజనులకుఁ గల్పవల్లి
ప్రియములకువెల్లి యీదాది రెడ్డిపల్లి.

3. "Ninety nine per cent inspiration and one per-cent perspiration make one a poet."

Shakespeare.

భావకప్రకటనము. తెలుఁగులో మత్తేభము

మ॥ విదితస్ఫూర్తినెఱుంగఁగావలయు నావేశంబునుం జూడఁ

దొం॥ బదియుఁ దొమ్మిదిపాళ్లు వాఙ్మయకళానైశద్య వి
స్ఫూర్తియు॥ య్యదిపాలొక్కటిచేరి మానవుని గన్యగ్రేస
రుఁ జేయు" నం॥ చుదితంబౌనటుచెప్పె షేక్సపియరో
హోవాని మేధాకళల్.

4. దాక్షిణాత్యసోదరుల గుఱించి సీసము

సీ॥ హరునయనాగ్నియం దలరు పాత్రము చేతఁ
గైలాసవాసుల కడుపునించి
రవిబింబమధ్య పాత్రము చేతఁ నాకభూ
ములలోనివారి పొట్టలనునించి
వైశ్వానరునిపైని పాత్రంబు చేతఁ దే
జోవతివారి కుక్షులనునించి
బడబానలముపైని పాత్రంబు చేతఁ బా
తాళవాసుల యుదరాళి నించి
తే॥గీ॥ యగ్నిళుల్ల లభించెదు నచట నెల్లఁ
బాత్రములు పెట్టి మనలఁ గాపాడ నేర్చి
యలచతుర్దశలోకంబు లాక్రమించె
నా 'బ్రాహ్మణయ్యరు' పరమేశుఁ డగునొ యేమొ.

5. సమస్య.

శ్లో॥ దానైర్యజ్ఞై రపివరజనసే దుర్లభం యత్తపోభిః
దేవా దైత్యా జలనిధితటే స్పర్ధితా యత్కృతే తత్
మత్వా తుచ్ఛం యువతికుచతటం ప్రాప్నువంతో మనుష్యాః
(తత్రత్యానాం సులభమమృతం సన్నిధానాత్సుధాంశోః.)

6. సమస్య.

చ॥ అనువుగసర్పముఖ్ శిశువు నైనఁగఱంచును గానవిద్య భూ
జనులకుఁగల్గు మూఢతను సాహితిమాన్పెడి నివ్వివాక్సతీ
ఘనకుచసన్నిభంబు లనఁగా బుధులెంచెద రట్టి శారదా
స్తనములు లేనిపూరుషుఁడుసంస్తవనీయుఁడుగాఁడుధాత్రిలో

7. సహారాయెడారినిగూర్చి సీసము.

సీ॥ అజము వహ్నికిని వాహనమైన యటులొక్క
యొంటె చరింప వీలౌదవుచుండ
నిసుకనుఁ దోఁడి యొక్కింత సేపిడి నంతఁ
దడిబియ్య మన్నమై తనరుచుండ
నవనిసజ్జనులట్లు లతిదూరమున 'కోయ
సీ' సను నొకశోతు చెలమవెలయ
ఫలవంతముగ దీని సలుపుటెట్లో యంచుఁ
దెల్లవారెప్డు చింతించుచుండ
తే॥ గీ॥ నాఫ్రికాఖండమను కుండమందుఁ వెలుఁగు
వీతిహోత్రంబు నా మూఁడు వేలమైళ్ల
పొడవు నంతియు వెడలుపై యడరునట్టి
యా 'మహారాయెడారి' నేమందుమయ్య.

8. సమస్య. తే॥ గీ॥ కోమలమనసులలో రహస్యములెఱుంగు
మంద మారుతమందు మర్మంబెఱుంగు
సాంద్రచంద్రాతపములోని చలువ యెఱుఁగుఁ
(గవి యెఱుంగని దొక్కటి గలదె జగతి?)

9. స్త్రీ పురుషసంవాదము పరస్పరనింద శార్దూలము.

శా॥ జారత్వంబనృతంబు మోసమునుశీ ర్షంబందునన్ బుట్టెమీ
కోరామామణులార! యంచుఁబురుషుండొక్కింతనోరెత్తఁచీ
పోరా నీముఖ మేమెఱుంగుదు విసీ బుద్ధావ తారంబులై
నారా మీరలటంచు గేలిసలిపెన్ నాళీకపత్రాక్షియున్.

10. సమస్య.

ఉ॥ వర్షము లేక పైరు వసివాడఁగ శాంతికలా కలాపముల్
హర్షమువీడఁజేసి యడియాసలనింగిని జూచుచుండఁగా
వార్షికమేఘమప్డు తనపైరును దాటుచుఁబోవ ఖిన్నుఁడై
(కర్షకుఁడేడ్చె వారిదవికాసముగాంచి మరుస్థలంబునన్.)

14. సమస్య.

చ॥ నటకులచెంత గ్రామకరణంబులపొంత వకీళ్ళయందుఁ బ్ర
స్ఫుటనవయౌవనాఢ్యలగు బోగపుఁగాంతల పల్లెఱందు ని
ల్చుటయిదిభద్రమాయనుచులోనఁదలంకుచు దూరదర్శియై
(తలుకున స్వర్ణకారకుని దాఁపునఁ జేరె సబద్ధ మిద్ధరన్)

♦ ♦ ♦

16. వివాహకాలమున యజమాని మనోస్థితి.

ఆ॥ వె॥ ఇతర వేళలందె యింటికేరైన రాఁ
బోవనీఁడు నాదు ముద్దుమామ
యింతమందిచేరి సంతసంబున నుండ
నెంతయుబ్బె నొక్కొ యితనిమనసు?

అవధానాంతమునఁ గవులు చదివిన పద్యములు.

క॥ అవధానజయము బుధగా
రవ మందిన మీరు సుకవిరాజులు మావా
రవుటను మాకును మాబం
ధువులకు వెలరేనికీర్తితోషములొదవెన్.

సీ॥ కడపజిల్లా జడ్జిగారు సభాస్థలిఁ
బ్రీతిచేఁ గవిసింహ బిరుదమొసఁగ
నెల్లూరిపురి సూరినికరంబులెల్లను
బచ్చలపతకముల్ మెచ్చియిడఁగ
గుత్తిపట్టణ పండితోత్తముల్ హర్షించి
కరముల రత్నకంకణములుంప
మహితమా జంబులమడుగు విద్వత్కోటి
పాల్జోడు పైఁగప్పి సత్కరింప

తే॥ గీ॥ దత్తమండలముల యశోధాములగుచు
వెలయు మిముబోంట్ల వినుతింపఁగలమె రాజ
శేఖరకవీంద్ర వెంకటశేష సుకవు
లార సుకవిత్వ లీలా విహారులార!

మ॥ హరజూటా నటదాపగా తరళ భంగా భంగ భంగీ తదం
తర సౌవర్ణ సహస్రపర్ణ మకరంద స్వాదు నిందా ధురం
ధరయుష్మత్కవితామృతాపహృతచేతశ్చంచరీకుల్ బుధుల్
శిరముల్ ద్రిప్పుచు మీవధానసభలన్ జిత్రాకృతిన్ నిల్వరే

మ॥ కవులున్నార లనేకులెల్లెడల లెక్కన్ బెట్టి చూడంగఁ ద

త్కవిలోకంబులలో వధానశతముఁ గావించి బంగారురం
గవుసాము్ల్ జయఘంటికల్ బిరుదులీయఁ గాంచిదత్తావనిఁ
గవు లీయిర్వురె యన్నకీర్తిని గొనంగాఁ జెల్లె మీ కెల్లెడన్.

సీ॥ మోమునఁ జిఱునవ్వు గోము చూపఁగ బుధు
    లిచ్చిన ప్రశ్నల నెదురుకొనుట
యతికఠినపు సమస్యలనైన ఛేదించి
    తృటిని భావంబు గ్రహించుటయును
నమరగంగాతరంగార్భటి గులుకఁగ నై
    తలు సెప్పి పద్యముల్ వలుకుటయును
ధారణాబలసముద్ధతిచేతఁ బూర్తిచే
    సిన పద్యములు విప్పి చెప్పుటయును
తే॥ గీ॥ గంటి వేలలేని మోదంబుఁ గంటి నిట్టి
వారు లేరనుకొంటి మీ భూరియశము
నెంచుకొనుచుంటి నితరులకిది యలభ్య
మంటి మీసాటి నీరలే యగుదురంటి.

యన్నమూరు సుబ్రహ్మణ్యకవి.



ప్రొద్దటూరు శ్రీ జానకీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.—1931.

# జనోపకారిణిస్టోర్సు వారి గ్రంథములు

## అనుభవచికిత్సాదర్పణము

గ్రంథకర్త : సుప్రసిద్ధ వైద్యపండిత, లోకరాజు,

3 వ కూర్పు] వసంతపురం మునయ్యగారు. [గ్లేజు కాగితములు

యీగ్రంథమున ఔషధములను చేయునట్టు బయలుపెట్టబడియున్నది. ఏబది సంవత్సరములుగ లోకమునందనేక స్థలములందు ఉపయోగింపబడి యనేకులను రక్షించిన బ్రహ్మశ్రీ వైద్యపండిత లోకరాజు వసంతపురం మునయ్యగారి అనుభవములో వాడి గుణమిచ్చిన ఔషధములను కొంచెమయినను మరుగుపెట్టక బాలురకుసహితము నమ్మకముగా యివ్వతగిన ఔషధములను జేయు పద్ధతులను వ్రాయబడినది.

యీపుస్తకపు సహాయమున ఎంతమాత్రపు ప్రాథమిక వైద్యజ్ఞానము గలవారయినను తమంతటతామే ఔషధముల చేసికొనగలరని మానమ్మకము. యీగ్రంథమునందు సుమారు 500 పుటలు, 1800 చికిత్సలు చేయుటకు చక్కని తేనెలూరు తేటతెనుగు పద్యములు బాలురకు సహితము అర్థమగునట్లు అచ్చటచ్చట కఠినపదములకు తెలుగుటీకతో సహా వ్రాయబడినది. ఈగ్రంథమునందలి చికిత్సలలో నొక్కటియైనను గుణమునిచ్చుటకు తప్పినదని రుజువుచేసిన సొమ్ము వాపసుయివ్వబడును. కొద్దిప్రతులు మాత్రమే గలవు.

వెల రు 3—8—0 క్యాలికో. 3—0—0

---

బజ్వాలి షేకుహుశేన్ దాసుగారి అచలఅనుభవ

## వేదాంత తత్వములు.

ఈగ్రంథమున మతభేదములు లేక ప్రపంచములోనున్న అన్ని వేదాంత విషయములును తత్వములుగ రచియించియున్నారు. శ్రీ నాసర్ మస్తాన్ షరీఫ్ షా ఖాద్రిగారిచే రచియింపబడిన శ్రీ వీరాంజనేయస్తుతి సీసపద్యములు హుశేన్ దాసుగారి ఛాయాపటముతో సహా యిందుగలవు. వెల 0-6-0

---

వలయువారు:- జనోపకారిణిస్టోర్సు, ప్రొద్దుటూరు, అనివార్యుడు.

## నీతిసుధానిధి

గ్రంథకర్త: బి. నారాయణస్వామి
కవిరత్న కసిరెడ్డి వెంకటసుబ్బారెడ్డి
హెచ్. మహబూబ్ మియ్యాఖాన్ గార్లు.

మ-రా-రా-శ్రీ కే. వి. లక్ష్మణరావుగారీ పుస్తకమునకు పీఠిక వ్రాసియున్నారు. ఈ గ్రంథము బాలురబోధనార్థము కడు నుపయోగకరము సులభమైన వృత్తము, మృదుశైలి, నీతిబోధ మనోరంజనము అను గుణము లన్నియు బాలురనాకర్షించుటకు దగినవి యిందుగలవు పెక్కుచోట్ల పాఠశాలలో ఉపాధ్యాయులు విద్యార్థులకు పఠనీయగ్రంధముగ నేర్పరచి యున్నారు దొరతనము వారివల్ల పఠనీయగ్రంధముగా ఆమోదింప బడియున్నది.

వెల. 0—12—0

## శతకద్వయము

గ్రంథకర్త: నామా వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.

ఆంధ్రవాల్మీకియను బిరుదమును వహించిన మ-రా-శ్రీ వావిలికొలను సుబ్బరావుగారీ చంద్రమౌళీశ్వర చెన్నకేశవ శతకద్వయమునకు పీఠిక వ్రాసియున్నారు. ఇది భక్తిరస ప్రధానముగల యొక చక్కని పద్యకావ్యము.

వెల 0—8—0

## చింతా నరసింహా రెడ్డిగారి

### గ్రంథములు.

| | | |
|---|---|---|
| సుగుణమణి (అయిదంకముల నాటకము) | | 0–8–0 |
| పడకటిల్లు | (నాటకము) | 0–2–0 |
| పద్మావతి | ,, | 0–6–0 |
| వలపులేనిపెండ్లి వగపులపుట్ట | ,, | 0–2–0 |
| సత్యవతి | (నవల) | 0–8–0 |

---

జనోపకారిణీస్టోర్సు, ప్రొద్దుటూరు.

# కృష్ణవేణి.

గ్రంథకర్త:—కలచవీడు వేంకటరమణాచార్యులు.

ఇది యొక చిన్న పద్యకావ్యము. నాయికా నాయకులగు కృష్ణవేణి శంకరుల కథ ఇందలి ముఖ్యాంశము. వీరాబాల్యప్రవర్ధమాన శుద్ధ ప్రణయ బద్ధ హృదయులు, ఇట్టి వీరికి వరశుల్కాపేక్షచే కథానాయకుడగు శంకరుని తండ్రికలిగించిన కష్టములను కుమారుని వరశుల్కమను సాంఘిక కళంకమును దొలగింపజేసిన యత్నములను జక్కగ వర్ణింప బడినవి

ఈ చిన్న పొత్తమందలి మృదుమధురశైలిని జూపుటకొక పద్యము ను పొందుపరచితిమి.

తే. గీ. చరులఁదినుపించు నాటిభాషణములందు
వేడ్కనాడెడు నాటి ప్రవృత్తులందు
నేదియోరైక్యభావ మూహించికాదె
మనకు మన వారు వరుసకల్పనము సేత.

వెల 0—6—0.

# చారుమతి

గ్రంథకర్త:—కలచవీడు వేంకటరమణాచార్యులు

ఇది యొక చారిత్రిక విషయముపై నాధారపడిన కల్పనాకథ శ్రీ అశోకచక్రవర్తి కొమార్తెయగు చారుమతి విషయమిందు మృదుమధురము యిన వాక్కులతో వర్ణింపజడినది. వెల. 0—6—0

---

జనోపకారిణిస్టోర్సు, ప్రొద్దుటూరు.

## శతావధాని పంచానన & కవిసింహ
## డి. రాజశేఖర కవిగారి గ్రంథములు

# వీరమతి

ఘూర్జరదేశ నారీమణి యనియు' నుత్తమ పతివ్రతాతిలక మనియు బ్రఖ్యాతిఁగాంచి, తన మానసంరక్షణమునకై యొక గంటలో 12 మందిని ఖడ్గమునకర్పించిన రాజపుత్రస్త్రీ చరిత్రము 900 పద్యములు హృద్యములు. శైలి నూతనము మనోహరముతిరుపతి వేంకటేశ్వరులలో నొకరగు బ్ర॥ శ్రీ చెళ్లపిళ్ల వేంకటేశ్వరశాస్త్రి శతావధానిగారు విపులమైన యుపోద్ఘాతము వ్రాసియున్నారు. భాషాభిమానులు తప్పక చదువదగినది. వెల 1-0-0

# పద్మావతీవిజయము.

### 5 అంకముల చక్కని నాటకరాజము.

ఇది మహోదాత్తగుణ స్ఫురణముగలిగి వీరరసమహావతారమగు నొక కాంతామణీ దివ్యచరిత్రము. పద్మావతీదేవి పురుషుల దుర్గుణములఁగుఱించి వివరించుతావులు కేవలము రససంఘటనములు. ఈమెబుద్ధి నిరుపమానము. పతిభక్తి సకలజన స్తవనీయము. పాతివ్రిత్య మనన్యసాధారణము ఔదార్య మప్రతిమానము ఈమెనామము కుజనులకుచ్చాటన మంత్రరాజము. ఈమె దర్శనము దుర్మార్గులకు మృత్యుసందర్శనము. అర్ధరాత్రిమునఁ గొత్తయూర వన్యగృహమున జగన్మోహనుసంతవానిని వలదీసిన యుదాత్తనాయికారత్నము సద్గుణరత్నములకు రత్నాకరము. ఇట్టినాటకరాజ మిదివరకాంధ్రభాషలోలేదు, శైలిమనోహరము పద్యములు హృద్యములు గద్యములుత్సాహసంస్ఫూరితములు స్త్రీపురుషులు తప్పక చదువదగినది. వెల రు, 1-4-0

# సీతాకల్యాణము

బాలసరస్వతి, కావ్యతీర్థ, అభినవవాల్మీక్యాది బహుళ బిరుదాంచితు లగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారీ నాటకమున కుపోద్ఘాతమును వ్రాసియున్నారు.

శ్రీరామజననము మొదలు సీతాకల్యాణమువఱకుగల కథయిందు గలదు. ప్రథమాంకమున విష్ణునితో దేవతలు మొఱపెట్టుకొనుటయు ద్వితీయాంకమున దశరథ విశ్వామిత్ర సంవాదమును. తృతీయాంకమున విశ్వామిత్ర చరిత్రమును జతుర్థాంకమున స్వయంవరమును, బంచమాంకమున దశరథ రామభార్గవరాముల సమావేశసంవాదము, మిక్కిలి రుచిమంతముగ నుండును పరశురామ క్షత్రియరాముల సమావేశాదులునూతన విధానములతో నడుపబడి మిక్కిలి హృద్యంబుగను నానందకరముగ నుండును, శైలిశ్రేష్ఠము, వచనములును, బద్యములును రసపూర్ణములు. భావములు హృదయంగమములు రామాయణమును దెలియగోరువారందఱు తప్పకచదువదగినది వెల 0-8-0

## వృద్ధి, మూలసంవాదము

1 రూపాయ 120 సం॥ లకు 8, 26, 726 రూపాయలుగను 1 పుట్టి 120 సం॥కు 14338907 పుట్లుగాను పెరిగెవిజృంభణములిందు విపులముగావర్ణింపఁబడినది మూలము శాంతమును మంచితనమును వడ్డి గర్వమును దుర్లిప్తపాటున అభివర్ణింపఁబడినవి. మొదట నారదుడు పంచాయతిచేయును. వడ్డి సమ్మతింపక మఱలపోట్లాడఁగా విష్ణుదేవుఁడు తీర్పుచెప్పును. వడ్డి మూలమునకు బాధాకారిఁతయగును. వాక్యవాక్యములకును శబ్దశబ్దమునకును రసముచిందులువాఱు చుండును. వెల రు 0-2-0 మాత్రమే

### శరన్నవరాత్రపద్యావళి

ఈ గ్రంథము నవరాత్రములలో కవులకు జరిగిన పోటీపరీక్షలో ప్రథమ బహుమానమును బడసినది. అనేకులచేపొగడ్తగాంచినది. వెల రు 0-2-0

---

## జనోపకారిణిస్టోర్సు, ప్రొద్దుటూరు

# కల్వటూరి జయరామరావుగారిచే

రచియింపబడిన గ్రంథములు

## రేనాటివీరుడు

ఇది చరిత్రాత్మకమగు నవల. ఉయ్యాలవాడ నరసింహారెడ్డి యొక్క చరిత్రము. చక్కగా వ్రాయబడియున్నది. నరసింహారెడ్డిగారు సర్కారు వారికి తిరుగబడి కోవెలకుంట్ల తాలూకా కచ్చేరిని దోచినది అందులకు తగిన కారణములు చక్కని సులభశైలిని వ్రాయబడినది. కడప కర్నూల్ జిల్లాలను గడగడ వడకించిన యావీరుని చరిత్రము చదువవలసినదేగాని వ్రాయనలవికాదు. వెల 0—12—0

## తుకారాం

ఇది పురాణసంబంధమయిన నాటకరాజము. భక్తిరసము వెల్లివిరియుచున్నది. తుకారాంభక్తియు శ్రీ శివాజి రౌద్రమును సర్వావార చతురతబుద్ధి పద్మ పాతివ్రత్యము చదివి తీరవలయును. వెల. 0—12—0

## కలియుగదర్పణము.

వృద్ధ వివాహములను అతిబాల్య వివాహములను ఖండించుటకయి వ్రాసిన చక్కని నాటకరాజము సంఘ దురాచారములను నిర్భయముగ ఖండింపబడినది. చక్కని పద్యశర్కములతో గ్రంధమంతయు నిండింప బడినది. పద్యములను చదివినవో కడుపుబ్బ నవ్వు పుట్టించును. ఆంధ్రభాషయందిట్టి గ్రంధము లెన్నియోలేవు. వెల 1—0—0

## గండికోట పతనము

త్వరలో వెలువడును. త్వరపడుడు.

అయిదంకముల చరిత్రాత్మక నాటకము. తాళికోట యుద్ధము ముగిసిన తర్వాత జరిగినకథ. కథాకల్పనము బహు చక్కగనున్నది

---

జనోపకారిణిస్టోర్సు, ప్రొద్దుటూరు.